## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి.కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **సుందరయ్య విజ్ఞాన కేంద్రం** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **సుందరయ్య విజ్ఞాన కేంద్రం** వారి వెబ్ సైట్: http://sundarayya.org/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో **సుందరయ్య విజ్ఞాన కేంద్రం** వెబ్ సైట్ వారు అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు,కనుక వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు*

# సుందరయ్య విజ్ఞాన కేంద్రం వారి వెబ్ సైట్:

**http://sundarayya.org/**

Sundarayya Centenary Cel ×

sundarayya.org

Sundarayya Vignana Kendram

Home | About SVK | Library | Projects | Donations | Publications | స్వేచ్ఛా విజ్ఞాన ప్రవంతి | Services | Contact Us

## Sundarayya Centenary Celebrations

### India Today: Looking Back, Looking Forward

India Today: Looking Back, Looking Forward
Watch Videos (Click to Download Papers)

On the occasion of the birth centenary of P. Sundarayya, a freedom fighter, communist and above all an individual who had given utmost importance to collecting facts and understanding them for political praxis, we feel it prudent to organise a seminar in his memory to comprehensively discuss and debate issues concerning the present, past and future of our country.

Read More

### Agenda

| Time | Session | Speakers |
|---|---|---|
| 4th May 2013<br>10:00-14:00 | **Synoptic Session One**<br>Imperialism and the Indian Economy<br>Patterns of Class Formation since Independence<br>Communalisms: Changing Forms and Fortunes Since Independence | Amiya Kumar Bagchi<br>Prabhat Patnaik<br>Aijaz Ahmad |
| 4th May 2013<br>15.00-16.30 | **Industry, Finance, Planning**<br>International Finance And Development in India under Neo-Liberalism<br>Capitalists and Industrialisation in India<br>Planning and the regime of Capital in India | C.P.Chandrashekhar<br>Surajit Mazumdar<br>Chirashree Das Gupta |
| 4th May 2013<br>17.00-18.30 | **Women in Economy and Society**<br>Economic Policies and Women's Work<br>State Policies and Women<br>The Political Economy of Violence against Women. | Jayati Ghosh<br>Smita Gupta<br>Kalyani Menon Sen |
| 5th May 2013<br>9.30-13.30 | **Synoptic Session Two**<br>Agrarian Question and the Post-Independence State<br>Non-Alignment to Dependence: Shifting Paradigms for Foreign Policy<br>State, Market and the Media | Utsa Patnaik<br>Sukumar Muralidharan<br>Sashi Kumar<br>P. Sainath |
| 5th May 2013<br>15.00-16.30 | **The Agrarian Crisis**<br>An Overview<br>Assets, Incomes and Employment<br>Credit,Technology and Public Policy in Indian Agriculture | Venkatesh Athreya<br>Vikas Rawal<br>Ramakumar |

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ధనసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పీఠిక.

జ్యోతిశ్శాస్త్రములో ప్రాముఖ్యమైన సంతానరత్నాకరము అను సద్గ్రంథము తెలుగులో నిదివరకు నెవరును ముద్రించియుండ నందున నామిత్రులు కొందఱు కోరుటచే యీ గ్రంథమునందుండు, మూల శ్లోకములన్నియు సంపాదించి తాత్పర్యసహితముగా వ్రాసి ముద్రించితిని. యిదిగాక మనపూర్వులు సంపాదించి వ్రాసినశాంతులుగూడ యిందుచేర్పఁబడెను ఈగ్రంథమునందు నిలిచియున్న ముద్రణలోపములు నాకువ్రాసిపంపించిన పక్షమునవానిని రెండవ కూర్పునందు సవరించి ముద్రింపించెదను.

ఆర్యానందప్రెస్
మచిలీపట్టణము.

ఇట్లు,
చెల్లా లక్ష్మీనృసింహశాస్త్రి.

# విషయసూచిక.


| సంఖ్య | | పుట |
|---|---|---|
| 1 | పార్వతీపరమేశ్వర సంవాదము | 1 |
| 2 | స్త్రీపురుషదోష ప్రతిపాదకము | 2 |
| 3 | స్త్రీపురుషదోషము | ,, |
| 4 | ద్వితీయపటలప్రారంభము | 3 |
| 5 | దోషత్రయమునకు ప్రాయశ్చిత్తాభావము | 3 |
| 6 | సూర్యాదిగ్రహాణామీశ్వరాంశాదిస్వరూపము | 4 |
| 7 | దైవజ్ఞనిందాదోషము | ,, |
| 8 | దైవజ్ఞప్రశంసా | ,, |
| 9 | బహుపుత్రయోగము | 5 |
| 10 | సంతానయోగము | ,, |
| 11 | గ్రహాణాంస్థితి భేదములచేత్పుత్రభేదము | ,, |
| 12 | ప్రకారాంతరము | 6 |
| 13 | పుత్రపౌత్రాది యోగము | ,, |
| 14 | పుత్రీపుత్రసంఖ్యానియమము | ,, |
| 15 | దశపుత్రయోగము | 7 |
| 16 | షోడశపుత్రయోగము | ,, |
| 17 | ఏకాదశపుత్రయోగము | ,, |
| 18 | నవసంఖ్యాకపుత్రయోగము | ,, |
| 19 | అష్టపుత్రయోగము | ,, |
| 20 | సప్తపుత్రయోగము | 8 |
| 21 | షట్పుత్రషట్పుత్రీయోగము | ,, |
| 22 | పంచసుతయోగము | ,, |
| 23 | చతుఃపుత్రయోగము | ,, |
| 24 | త్రిపుత్రయోగము | ,, |
| 25 | ద్విపుత్రయోగము | ,, |
| 26 | ఏకపుత్రయోగము | 9 |
| 27 | స్త్రీసంతానాధిక యోగము | ,, |
| 28 | షట్పంచాష్టసంఖ్యాపుత్రీ యోగము | ,, |
| 29 | పంచపుత్రీ జననాత్పరం పుత్రోత్పత్తి | ,, |
| 30 | పుత్రీపుత్రయోగము | ,, |
| 31 | కేవలస్త్రీసంతానయోగము | 10 |
| 32 | పంచపుత్రీయోగము | ,, |
| 33 | పునర్వివాహే పుత్రయోగం | ,, |
| 34 | అన్యబీజాత్పుత్రోత్పత్తి | ,, |
| 35 | ప్రకారాంతరేణాన్యబీజాత్పుత్రోత్పత్తి | ,, |
| 36 | శూద్రబీజాత్పుత్రోత్పత్తి | 11 |
| 37 | పుష్పిణ్యాంపుత్రోత్పత్తి | ,, |
| 38 | నీచాత్పుత్రజననము | ,, |
| 39 | ప్రకారాంతరేణ నీచాత్పుత్రప్రాప్తి | 12 |
| 40 | పుష్పిణ్యామన్యబీజాత్పుత్రోత్పత్తి | ,, |

| సంఖ్య | | పుట |
|---|---|---|
| 41 | దత్తపుత్రాదియోగము | ,, |
| 42 | దత్తపుత్రయోగము | 13 |
| 34 | మృతపుత్రయోగము | ,, |
| 44 | పునఃప్రకారాంతరేణ దత్తపుత్రయోగము | ,, |
| 45 | దత్తస్వీకారాత్పరం ఔరసజననము | 14 |
| 43 | పునఃప్రకారాంతరేణ దత్తపుత్రయోగము | ,, |
| 47 | పునఃపుత్రస్వీకారాత్పరం ఔరసయోగము | 15 |
| 48 | దత్తపుత్రయోగము | ,, |
| 49 | దత్తపుత్రమరణయోగము | ,, |
| 50 | దత్తపుత్రశత్రుయోగము | ,, |
| 51 | పునర్దత్తమరణయోగము | ,, |
| 52 | పునర్దత్తపుత్రయోగము | 16 |
| 53 | అపక్వకాలే దత్తమృతియోగము | ,, |
| 54 | దత్తపుత్రమృతిదోష ప్రాయశ్చిత్తము | ,, |
| 55 | అత్రశివపూజా ప్రకారము | ,, |
| 56 | అనపత్యలక్షణ ప్రతిపాదకము | 18 |
| 57 | అపుత్రయోగము | ,, |
| 58 | ప్రకారాంతరేణ అపుత్రయోగము | ,, |
| 59 | బ్రహ్మహత్యాదిదోషము | 20 |
| 60 | ప్రాయశ్చిత్తానుష్ఠానేప్యపుత్రయోగము | 21 |
| 61 | రేతస్కన్నలక్షణ ప్రతిపాదకము | ,, |
| 62 | పితృశాపాద్వీర్య స్కన్నయోగము | ,, |
| 63 | ప్రకారాంతరేణ వీర్యస్ఖన్నయోగము | ,, |
| 64 | పితృశాప నివారణ ప్రాయశ్చిత్తప్రకారము | 23 |
| 65 | నైజమేషయంత్రోద్ధారము | ,, |
| 66 | గర్భస్రావలక్షణ ప్రతిపాదకము | 25 |
| 67 | గర్భస్రావయోగము | ,, |
| 68 | రక్తస్రావయోగము | 26 |
| 69 | గర్భస్రావనిమిత్త పంచదోషము | 28 |
| 70 | గర్భస్రావనివారక ప్రాయశ్చిత్తవిధి | ,, |
| 71 | ధాతృమంత్రానుష్ఠానక్రమము | ,, |
| 72 | మంత్రానుష్ఠానక్రియము | 31 |
| 73 | దేవశాపలక్షణ ప్రతిపాదకము | ,, |
| 74 | దేవశాపాత్పుత్ర నాశయోగము | 32 |
| 75 | దేవశాపనివారక శివపూజాక్రియము | 33 |





| సంఖ్య | | పుట |
|---|---|---|
| 76 | దేవశాపనివారక లింగదానక్రమము | 34 |
| 77 | శత్రుశాపాత్పుత్ర నాశయోగము | ,, |
| 78 | శత్రునాశనివారక దుర్గాపూజాక్రమము | 36 |
| 79 | దుర్గామంత్రానుష్ఠానక్రమము | ,, |
| 80 | దుర్గాయంత్ర దానం | 37 |
| 81 | విష్ణుశాపలక్షణ ప్రతిపాదకము | 38 |
| 82 | విష్ణుశాప పరిహారము | 42 |
| 83 | శ్రీకృష్ణయంత్రోద్ధారక్రియము | 43 |
| 84 | సంతానార్థం శ్రీకృష్ణప్రతిమాపూజాక్రియము | ,, |
| 85 | శ్రీకృష్ణ మంత్రానుష్ఠానక్రియము | ,, |
| 86 | శ్రీకృష్ణప్రతిమాదానక్రమము | 45 |
| 37 | వంధ్యాదోష భేదాజ్జనపతారతమ్యమ్ | ,, |
| 38 | శ్రీకృష్ణమూలమంత్రవిధానము | 46 |
| 39 | స్త్రీశాపలక్షణ ప్రతిపాదకము | 47 |
| 90 | స్త్రీశాపాత్పుత్ర నాశయోగము | ,, |
| 91 | మాతృశాపాత్పుత్రనాశయోగము | ,, |
| 92 | మాతృశాప పరిహారము | 49 |
| 93 | చరుహోమక్రియము | ,, |
| 94 | సర్పశాప పరిహారము | 51 |
| 95 | సర్పశాపాత్పుత్రనాశయోగము | 52 |
| 93 | మార్జాలహననాత్పుత్రనాశయోగము | 53 |
| 97 | మృతసర్ప సర్పాండవధోభేదాత్పుత్రనాశక్రమము | 54 |
| 98 | సర్పశాపనివారక ప్రాయశ్చిత్తప్రకారము | 55 |
| 99 | పిష్టసర్పాండ రచనాక్రియము | 56 |
| 100 | కలశస్థాపనవిధి | ,, |
| 101 | వేదాది పారాయణక్రమము | 57 |
| 1 2 | సర్పశాంతి హోమాదిక్రియము | 58 |
| 103 | మార్జాలహననదోష ప్రాయశ్చిత్తవిధి | 60 |
| 104 | బ్రహ్మశాపాత్పుత్రనాశయోగము | 61 |

| సంఖ్య | | పుట |
|---|---|---|
| 105 | బ్రహ్మశాపాన్నిర్వీర్య గుల్మోదర హృచ్ఛూలాదిరోగము | 62 |
| 106 | గ్రహభేదాద్దేవతా రోగాదిభేదము | 64 |
| 107 | రవిదోష నివారక శివ పూజాప్రకారము | 65 |
| 108 | చంద్రదోష నివారక దుర్గాపూజ | 66 |
| 109 | కుజదోష నివారక సుబ్రహ్మణ్య పూజ తన్మంత్రజపశ్చ | ,, |
| 110 | బుధశాప నివారక విష్ణు ప్రీతికర సాలగ్రామదానే | ,, |
| 111 | గురుశాప నివారక బ్రాహ్మణోపనయనాదిక ధనం | ,, |
| 112 | శుక్రదోషనివారక సేతుస్నాన త్రిశతిషోడశ జపాది | ,, |
| 113 | శనిదోష నివారక శివ లింగ ప్రతిష్ఠ | 67 |
| 114 | అన్యదోషాణాం తదుక్త శాంతి | ,, |
| 115 | చతుర్దశ పటల ప్రారంభము | ,, |
| 116 | సర్పశాపమున పుత్రనష్టము | 69 |
| 117 | పితృశాపమువల్ల సంతాన నష్టము | 70 |
| 118 | మాతృశాపము వలన సంతాన నష్టము | 73 |
| 119 | భ్రాతృశాపమువలన పుత్ర నష్టము | 76 |
| 120 | మాతులశాపము వలన పుత్రనష్టము | 78 |
| 121 | బ్రహ్మశాపమువలన సంతాన నష్టము | 80 |
| 122 | పత్నీశాపమువలన సంతాన నష్టము | 81 |
| 123 | ప్రేతశాపమున సంతాన నష్టము | 84 |
| 124 | బహుపుత్ర యోగములు | 86 |
| 125 | అనపత్యయోగములు | 88 |
| 126 | చిరకాల పుత్రయోగము | 89 |
| 127 | దత్తపుత్ర యోగములు | 90 |


విషయములు సమాప్తము.

### విజ్ఞప్తి.

అయ్యా! ఈగ్రంథమందెచ్చటనైనను స్ఖాలిత్యములున్నచో నాకువ్రాసిపంపించవలెను రెండవముద్రణమునందు సవరించబడును.

ఓమ్పరబ్రహ్మణేనమః.

# సంతానరత్నాకరము.

## పార్వతీపరమేశ్వరసంవాదము.

శ్లో॥ కైలాసశిఖరేరమ్యే నానాధాతువిభూషితే। విచిత్రనవరత్నాభే శుభసింహాసనేస్థితమ్। ఇంద్రాదిలోకపాలైశ్చ పూజితంభువనేశ్వరమ్। బ్రహ్మర్షిభిస్తుతంశాంతం బ్రహ్మవిష్ణ్వాదిసేవితమ్॥ మన్మథధ్వంసినంరుద్రం రతిదేవ్యైవరప్రదమ్। ప్రసన్నవదనందేవం నత్వాస్తుత్వాథపార్వతీ॥ కించిన్నమ్రముఖీభూత్వా స్థితాసాలజ్జయాతదా॥

తా॥ పూర్వకాలమందు అనేకములైన గైరికాదిధాతువులచేత అలంకరించబడియున్నదియు, నానావిధ రత్నముల గుంపువలె యున్నదియునైన కైలాసపర్వతమందు సింహాసనమందు కూర్చుని ఇంద్రుడు మొదలగు దిక్పాలకులచేత పూజింపబడుచున్నటువంటిన్ని, త్రిభువనములకు ఈశ్వరుడయినటువంటిన్ని, బ్రహ్మర్షులచేత స్తుతించబడుచున్నటువంటిన్ని, శాంతుడును, బ్రహ్మనారాయణాదులచేత సేవించబడుచున్నటువంటిన్ని, మన్మథుని సంహరించి తిరిగి రతీదేవిప్రార్థించగా జీవింపచేసినటువంటిన్ని, ప్రసాదముతో గూడిన ముఖముగలిగినటువంటిన్ని, సాంబమూర్తిని పార్వతీదేవి స్తుతించి సిగ్గుచేత కొంచము తలవంచుకొని సమీపమందుండెను.

శ్లో॥ ఏవంభూతాం స్వకాంతాంతాం సభాయాం పృష్టుముద్యతామ్। అతికిన్నాంనిజాంకస్థాం పార్వతీంపరమేశ్వరః॥

తా॥ తరువాత శివుడు యిట్లు తనను యేమో అడగదలచి సభలో సిగ్గుచేత ఖేదముతో గూడియున్న పార్వతిని తనతొడమీద కూర్చుండ బెట్టుకొని యిట్లనియె.

శ్లో॥ ఏహికల్యాణిగిరిజే కిద్దృశం తేమనోవ్యథా। ఇతిశ్రుత్వాస్వపత్యుస్సా వాచంహృద్యాంశుభాస్వితామ్॥ అంకాదుత్థాయశంభోస్తు నత్వాభక్తివినమ్రధీః। పునఃపప్రచ్ఛభర్తారం పార్వతీపరమేశ్వరమ్॥

తా॥ ఓపార్వతీ నీకిప్పుడీదుఃఖము నొందుటకు గలిగినదియాసిగ్గెందుకు నాకు చెప్పుము. యిట్లు తనభర్తయైనశివుడు అడగగా పార్వతి దయతో గూడిన యామాటవిని సంతోషించి తొడమీదనుంచిదిగి నమస్కరించి స్తుతించి యీప్రకారముగా అడిగెను.

శ్లో॥ నమేపుత్రసుఖంకించిన్నమేస్తిమనసోముదమ్ । కేనదోషేణమేశంభో గర్భస్స్రావస్సంనదస్వభో॥

తా॥ ఓశంకరా! నాకుపుత్రసుఖము లేకపోయెగద నా మనసుకు సంతోషమే లేకపోయెగదా నేనేమిపాతకము చేసితినో నాకు గర్భభంగముగలిగినది.

శ్లో॥ గిరిజాయావచశ్శ్రుత్వా ఖిన్నాయాశ్శంభురాదరాత్ । ఆరోప్యాంకేనిజామార్యాం పత్నీంప్రోవాచశంకరః॥

తా॥ యిట్లు దుఃఖముతో గూడిన పార్వతీదేవి మాటవిని శంకరుడు ప్రేమతో ఆమెను తనతొడమీద కూర్చుండబెట్టుకుని యిట్లని చెప్పుచున్నాడు.

### స్త్రీపురుషదోషప్రతిపాదకమ్.

శ్లో॥ శృణుత్వంగిరిజేతాన్హిదోషాన్షట్సప్తసంజ్ఞికాన్ । ప్రాణినాంచైవసర్వేషాం మంగనానాంవిశేషతః॥

తా॥ ఓపార్వతీవినుము లోకములందు అందరికిని నేచెప్పబోవు దోషములుండును అందులో స్త్రీలకుముఖ్యముగా పదమూడు దోషములుండును.

శ్లో॥ స్త్రీణాంచైవానపత్యత్వం దత్తపుత్రాదిసంభవః । స్రావసంతతినాశశ్చ మృతపుత్రత్వమేవచ ॥ స్కన్నంచక్రిమికూపశ్చ రక్తస్రావస్తథైవచ॥ భూతగ్రాసోరతేర్భిన్నం శుక్లతోయత్వమేవచ । పరివేషస్తథాజ్ఞేయ పాతదోషాస్త్రయోదశ॥

తా॥ ఆస్త్రీదోషములు అనపత్యతదత్తపుత్రపరిగ్రహము, గర్భస్రావము, సంతాననాశనము, మృతప్రసవము, స్కన్నము, పాతము, క్రిమికూపము, రక్తస్రావము, భూతగ్రాసము, రతిభిన్నము, శుక్లతోయత్వము, పరివేషము, గర్భపాతము, యివి ౧౩ విధములుగా నుండుననితా॥

### స్త్రీపురుషదోషాః.

శ్లో॥ నరాణాంచాల్పపుత్రత్వం బహుపుత్రత్వమేవచ। ఏకపుత్రత్వమేకాయాం పత్న్యామనేకసుతాతథా॥ స్త్రీప్రసూతిత్వమేవాథ పుంప్రసూతిత్వమేవచ । అన్యక్షేత్రోద్భవంచాన్య బీజాత్పుత్రసముద్భవః॥ ఏవమష్టవిధంప్రోక్తం పుత్రోత్పత్తేస్తుకారణమ్॥

తా॥ పురుషదోషములు స్వల్పసంతానము బహుసంతానము ఏకపత్నియందేక పుత్రప్రాప్తి ఏకకన్యకాప్రాప్తి స్త్రీసంతానము కేవలపురుష సంతానము అన్యక్షేత్రమందు సంతానము స్వక్షేత్రమందు అన్యబీజసంతానము యివి యెనిమిది విధములు.



శ్లో॥ పుణ్యంపాపంపూర్వభవే యత్కృతంజ్ఞానతోపివా। అజ్ఞానతోవాప్యేదత్తే సముపస్థితమద్యవై ॥ కృతంపుణ్యంచభోక్తవ్యం తద్వదేవాశుభంకృతమ్। ఇత్థంపరంమహాభాగేమాకృథాస్త్వంమనోవ్యథాం॥

తా॥ పూర్వజన్మమందు తెలిసియు తెలియకయు పుణ్యముగాని పాపముగాని చేసినయడల యీజన్మమందు పుణ్యఫలముగాని, పాపఫలముగాని, అనుభవించకతప్పదు కనుక నీవు దీనికయి శోకించకుము.

సంతానరత్నాకరే ప్రథమపటలస్సమాప్తః.

---

### అథ ద్వితీయపటల ప్రారంభః.

శ్లో॥ శంకరస్యవచశ్శ్రుత్వా ప్రసన్నాపార్వతీతథా। దోషాంస్త్రయోదశవిధాన్ విస్తరాద్వక్తుమర్హసి॥ ఇతీశంభుంపునస్తుత్వా తస్థౌశంభుసమీపతః॥ శ్రోతుకామాప్రియంకాంతం పుత్రార్థంమేనకాత్మజా॥

తా॥ యిట్లుశంకరుడు చెప్పగావిని పార్వతి మంచిమనస్సుతో ఓ శంకరా పదమూడు దోషములెవ్వియో నాకు చెప్పుమని తిరిగి స్తుతించి పుత్రార్థముగా వినగోరితిని అనిచెప్పి అచ్చట నిలచుండెను.

శ్లో॥ ఇతిదేవ్యావచశ్శ్రుత్వా శంకరోలోకశంకరః । శ్రుణుదేవిప్రవక్ష్యామి సర్వకామహితాయతే॥ శుభాశుభఫలంశాస్త్రం గుహ్యాద్గుహ్యతరంశుభమ్। నప్రకాశ్యంసదాదేవి దేవతానాంసుదుర్లభమ్॥

తా॥ యిట్లుపార్వతి యడుగగా సమస్తలోకములకు సుఖకరుడగు శివుడు ఆమెతో యిట్లనిచెప్పదొడగెను ఓ పార్వతీవినుము నీమనోభీష్టము తీరును యీ సంతానమును గుఱించినదోషములు చాలారహస్యము ముందుచెప్పబోవుయివి దేవతలకునుదుర్లభముగాన దీనినెవ్వరికిని చెప్పకుము. మూడుదోషములకు ప్రాయశ్చిత్తములేదు.

### దోషత్రయస్య ప్రాయశ్చిత్తాభావః.

శ్లో॥ దోషత్రయస్యనాస్త్యేవ ప్రాయశ్చిత్తంనగాత్మజే । నరాణాంచానపత్యత్వం దత్తపుత్రాదిసంభవః॥ తద్వత్సంతతినాశత్వం త్రయాణాంనాస్తినిష్కృతిః॥

తా॥ ఓపార్వతీ పైనచెప్పిన దోషములలో అనపత్యత, దత్తపుత్రత, సంతతినాశనము అనుయీమూటికిని ప్రాయశ్చిత్తములేదు.

శ్లో॥ జన్మకాలేమనుష్యాణాం యస్మిన్ భావేశుభాఃస్థితాః। శుభప్రదాగ్రహాస్సర్వే పాపాఃపాపఫలప్రదాః॥

తా॥ మనుష్యుల జన్మకాలమునకు యేభావమందయినను శుభగ్రహములున్న శుభంగలుగును పాపగ్రహములున్న పాపఫలముగలుగును.

## సూర్యాదిగ్రహాణామీశ్వరాంశాదిస్వరూపణమ్

శ్లో॥ అహంసూర్యోనిశానాధ స్త్వంమాహేశొగుహస్స్మృతః నారాయణో బుధశ్చైవపద్మజోగురురుచ్యతే। శుక్రశ్శచీపతిశ్చైవయమస్సౌర్యశ్చజస్తథా। రాహుర్భ్రాతాచిత్రగుప్తఃకాలఃకేతుర్నవగ్రహాః॥

తా॥ నేనురవిని, నీవుచంద్రుడవు, కుమారస్వామి అంగారకుడు, విష్ణువుబుధుడు, బ్రహ్మ బృహస్పతి, ఇంద్రుడు శుక్రుడు, యముడు శని, చిత్రగుప్తుడు రాహువు, కాలుడు కేతువు.

శ్లో॥ దేవతాగ్రహరూపేణ చరాస్సర్వత్రరాశిషు। ప్రాగ్భవేచార్జితంపుణ్యం పాపంస్వాణాంప్రదర్శకాః॥

తా॥ పయినచెప్పబడిన దేవతలు గ్రహరూపధారులై పన్నెండురాసులందు దిరుగుచు మనుష్యులపూర్వ జన్మమందుజేసిన పుణ్యమును పాపమును తెలియజేయుచుందురు.

## దైవజ్ఞనిందాయాం దోషః

శ్లో॥ తస్మాద్దైవజ్ఞమూలాచ్చ రాశీనాంశృణుయాత్ఫలమ్। దైవజ్ఞందేవతత్పశ్యే న్నానమన్యేనకర్హిచిత్। హంతిశ్రేయాంసిసర్వాణి దైవజ్ఞస్యావమానాత్॥

తా॥ కాబట్టి జ్యోతిష్కునివలన రాసులవల్ల గలుగుఫలమునువినవలయును జ్యోతిష్కుని దేవునివలెచూడవలెను జ్యోతిష్కుని నిందించగూడదు అట్లు నిందించిన యడల శుభములుగలుగవు.

## దైవజ్ఞప్రశంసా.

శ్లో॥ యథాప్రకాశయేద్దీప స్సమీపస్థఘటాదికమ్। తథాప్రకాశయేల్లగ్నా ద్దైవజ్ఞోభావికంఫలమ్॥

తా॥ లోకమందు దీపమెటుల సమీపమందున్న వస్తువులను తెలియజేయునో అట్లుజ్యోతిష్కుడు రాబోవుఫలములను తెలియజేయుననితా॥



శ్లో॥ శాస్త్రోక్తమార్గేణచ సాధుబుద్ధ్యా ప్రాగ్జన్మసంపాదితపాపసంఘాన్। విహాస్తుకామస్యసులభ్యమేతత్ఫలంలభేత్తస్యసుపుత్రసంతతిః॥

తా॥ మంచిబుద్ధితో శాస్త్రమార్గమున పూర్వార్జిత పాపములకు నివృత్తిజేయకోరువానికి సుపుత్రప్రాప్తిగలుగును అనగాప్రాయశ్చిత్తము చేసుకొనినయడల సంతానముగలుగునని తా॥

## బహుపుత్రయోగః.

శ్లో॥ సుతభవనేభృగుజీవ సౌమ్యనాథైర్యుతసహితైరవలోకితేయుతేవా। బహుసుతజననంవదంతిసంతస్సుతభవనేశబలేనచింత్యమేతత్॥

తా॥ బుధ, గురు, శుక్రులును, పంచమాధిపతియు పుత్రస్థానము నందున్నను, పుత్రస్థానమును చూచుచున్నను, అనేక సంతానములు గలుగునని పెద్దలు చెప్పుదురు పంచమాధిపతి బలమునుబట్టి సంతానమును విచారించవలయును.

## సంతానయోగః.

శ్లో॥ సుతభేశేబలసహితే హోరాధిపసంయుతేథవాదృష్టే। సుతభేపాపవిముక్తే సంతతిలాభోవినిర్దేశ్యః॥

తా॥ పుత్రస్థానాధిపతి బలవంతుడయియుండి లగ్నాధిపతితో గూడినగాని లేక చూడబడినగాని పుత్రస్థానము పాపగ్రహరహితమగుచుండగా సంతానముగలుగును.

శ్లో॥ పుత్రస్థానంగతేభౌమే వృషసింహాళిమీనగే। జీవదృష్టియుతేవాపి పుత్రావాప్తింవినిర్దిశేత్॥

తా॥ మేష సింహ వృశ్చిక మీనములలో నొకటిపుత్రస్థానమై అందుకుజుడుండి గురువుతోగూడియున్నగాని చూడబడియున్నగాని సంతానలాభముకలుగును.

## గ్రహాణాంస్థితిభేదాత్పుత్రభేదః.

శ్లో॥ సుతభేశుభమధ్యస్థే శుభదృష్టియుతేథవా। సుతభేశయుతేవాపి పుత్రావాప్తింవినిర్దిశేత్॥

తా॥ పుత్రస్థానము శుభగ్రహమధ్యమందుండి శుభగ్రహములతో గూడియున్నగాని పుత్రస్థానాధిపతితో గూడియున్నగాని సంతానముగలుగును.

శ్లో॥ జీవేశేబలసంయుక్తే పుత్రస్థేసప్తమేథవా। లగ్నేవాపైరదృష్టేపి సంతానాప్తింవినిర్దిశేత్॥

తా॥ పుత్రస్థానాధిపతి బలవంతుడయి పుత్రస్థానమందుగాని లేక సప్తమమందు గాని యుండగా లగ్నము పాపగ్రహములచేత చూడబడకయుండిన సంతానముగలుగును.

శ్లో॥ సుతేశే బలసంయుక్తే శుభమధ్యగతేథవా। శుభదృష్టియుతేవాపి సుతావాప్తిం వినిర్దిశేత్॥

తా॥ పుత్రస్థానాధిపతి బలవంతుడయి శుభగ్రహమధ్యమున్నను శుభగ్రహముల చేతచూడబడుచున్నను సంతానముకలుగును.

శ్లో॥ సుతనాథజీవకుజభాస్కరేషువా పురుషాంశ రాశిషుగతేషు కుత్రచిత్। మునయోవదంతి బహుపుత్రతాం తథాసుతనాథవీర్యవశతస్సుపుత్రతామ్॥

తా॥ పుత్రస్థానాధిపతి బృహస్పతి కుజరవులు పురుష రాసులందు గాని, పురుష రాశ్యంశలయందుగాని యుండినయెడల అనేకమంది పుత్రులుగలుగుదురు పంచమాధిపతి బలమునుబట్టి సంతానయోగమును చెప్పవలయును.

ప్రకారాంతరేణ బహుపుత్రః.

శ్లో॥ పరమోచ్చగతే సుతాధినాథే సుతరాశౌ శుభఖేచరేణ దృష్టే। సుతభే శుభైరదృష్టయుక్తే బహుపుత్రాన్ ప్రవదంతిబుద్ధిమంతః

తా॥ పుత్రస్థానాధిపతి పరమోచ్చయందుండగా పుత్రస్థానము శుభగ్రహదృష్టమైయుండగా పుత్రస్థానము పాపగ్రహములచేత చూడబడక పాపగ్రహములతోగూడక యున్నయెడల అనేకపుత్రులుగలుగుదురని పెద్దలువచించియున్నారు.

పుత్రపౌత్రాదియోగః.

శ్లో॥ సుతేశే రంధ్రరిఃఫారి భావాదన్యత్రసంస్థితే। బలయుక్తే శుభైర్దృష్టే పుత్రపౌత్రాన్వినిర్దిశేత్॥

తా॥ పుత్రస్థానాధిపతి ౮-౧౨-౬ స్థానములుగాక మిగతాస్థానములందుండి బలవంతుడయి శుభగ్రహములచేత చూడబడుచుండగా పుత్రులును పౌత్రులునుగలుగుదురు

ఇతి సంతానరత్నాకరే ద్వితీయపటలస్సమాప్తః.

---

అథ తృతీయపటల ప్రారంభః.

పుత్రీపుత్రసంఖ్యానియమః.

శ్లో॥ అథాతస్సంప్రవక్ష్యామి పుత్రయోగాణి వేతవ। శృణుష్వానన్యమనసా పుత్రంప్రాప్స్యసి హేప్రియే॥



తా॥ ఓపార్వతీ పుత్రసంతానయోగములను చెప్పెదను సావధానమనస్సుగలదానవై వినుము అటులయినయెడల నీవు పుత్రప్రాప్తిగలుగును.

దశపుత్రయోగః.

శ్లో॥ సుతేశే పరమోచ్చస్థే కారకే స్వోచ్చరాశిగే। వర్గోత్తమగతే జీవే దశసంఖ్యాకసూనవః॥

తా॥ పుత్రస్థానాధిపతి పరమోచ్చయందుండి పుత్రకారకుడు యుచ్చయందుగాని వర్గోత్తమాంశయందుగాని వుండినయెడల పదిమందిపుత్రులు గలుగుదురు.

షోడశపుత్రయోగః

శ్లో॥ పుత్రస్థానంగతే శుక్రే స్వక్షేత్రే బలసంయుతే। జీవదృష్టియుతేచైవ సూనవష్షోడశస్మృతాః॥

తా॥ వృషభ తులలలోనొకటి పుత్రస్థానమయి అందు శుక్రుడుండి గురువుచేత చూడబడుచున్నయెడల పదహారుగురు పుత్రులుగలుగుదురు.

ఏకాదశపుత్రయోగః.

శ్లో॥ సుతస్థానంగతే సూర్యే కర్మరాశౌ గురౌస్థితే। భాగ్యేశే లాభరాశిస్థే పుత్రైకాదశభాగ్భవేత్॥

తా॥ సూర్యుడు పుత్రస్థానమందును బృహస్పతి దశమమందును యుండగా భాగ్యాధిపతి యేకాదశమందుండినయెడల పదకొండుమంది పుత్రులుగలుగుదురు.

నవసంఖ్యాకపుత్రయోగః

శ్లో॥ పరమోచ్చగతే జీవే ధనేశే రాహుసంయుతే। భాగ్యేశే భాగ్యరాశిస్థే నవసంఖ్యాకసూనవః॥

తా॥ బృహస్పతి పరమోచ్చ యందును నవమాధిపతి భాగ్యమందును యుండగా ద్వితీయాధిపతి రాహువుతో గూడినయెడల తొమ్మిదిమందిపుత్రులు గలుగుదురు.

అష్టపుత్రయోగః.

శ్లో॥ పుత్రాద్భాగ్యంగతే జీవే సుతేశే బలసంయుతే। భాగ్యేశే కర్మరాశిస్థే వసుసంఖ్యాకసూనవః॥

తా॥ బృహస్పతి పుత్రస్థానమునకు తొమ్మిదవ స్థానమందును భాగ్యాధిపతి భాగ్యమందును యుండగా పుత్రస్థానాధిపతి బలవంతుడయియున్నయెడల యెనిమిదిమందిపుత్రులుగలుగుదురు.

### సప్తపుత్రయోగః.

శ్లో॥ పంచమాత్పంచమాంమందే సుతస్థేతదధీశ్వరే । సూనవ స్సప్తసంఖ్యాస్స్యు ద్వే గర్భేయమళోభవేత్ ॥

తా॥ శని పంచముకు పంచమందుండగా పుత్రస్థానాధిపతి పుత్రస్థానమందున్న యడల యేడుగురు పుత్రులు గలుగుదురు రెండవగర్భమందు కవలలుద్భవింతురు.

### షట్పుత్రషట్పుత్రీయోగః.

శ్లో॥ పిత్రేశేపంచమస్థానే సుతస్థేపంచమాధిపే । షట్సంఖ్యా సూనవః ప్రోక్తా ఏతేషాం స్త్రీప్రజాసమా ॥

తా॥ నవమాధిపతియు పంచమాధిపతియు పుత్రస్థానమందున్న యడల ఆఱుగురు కుమారులు గలుగుదురు ఆఱుగురు కుమార్తెలు గలుగుదురు.

### పంచసుతయోగః

శ్లో॥ లగ్నాత్పంచమగేజీవే జీవాత్పంచమగేశనౌ। కామేశేసుత భావస్థే పంచసంఖ్యాకసూనవః॥

తా॥ బృహస్పతి లగ్నముకు పంచమందును, బృహస్పతికి పంచమందు శనియుం డగా సప్తమాధిపతి పంచమమందుండిన యడల అయిదుగురు పుత్రులుగలుగుదురు.

### చతుః పుత్రయోగః.

శ్లో॥ సుతేశేపంచమస్థానే భాగ్యేశేవేశ్మసంయుతే । గురుణా సంయుతేశత్రి చతుస్సంఖ్యాకసూనవః॥

తా॥ పుత్రస్థానాధిపతి పుత్రస్థానమందుండగా భాగ్యాధిపతి గురువుతో గూడి భాగ్యమందున్న యడల నలుగురుకుమారులుగలుగుదురు.

### త్రిపుత్రయోగః.

శ్లో॥ పుత్రేశేసంయుతేవిత్తే విత్తేశేధర్మసంస్థితే । ధర్మేశేలాభ సంయుక్తే పుత్రత్రయముదీరయేత్ ॥

తా॥ పుత్రస్థానాధిపతి ద్వితీయమందును,ద్వితీయాధిపతి నవమమందును,నవమాధి పతి యేకాదశయందును, యున్న యడల ముగ్గురుపుత్రులు గలుగుదురు

### ద్విపుత్రయోగః.

శ్లో॥ చంద్రాత్పంచమగేజీవే జీవాత్పంచమగేశనౌ । మందాత్పంచమగేరాహు పుత్రద్వయముదీరయేత్ ॥



తా॥ చంద్రునకు పంచమమందు బృహస్పతియును, బృహస్పతికి పంచమమందు శనియును, శనికి పంచమమందు రాహువును యున్నయడల యిద్దరుపుత్రులుగలుగుదురు.

### ఏకపుత్రయోగః.

శ్లో॥ పుత్రాత్పుత్రగతేజీవే జీవాత్పుత్రగతేరవౌ । సూర్యాత్సప్తమగతేభౌమే పుత్రమేకంవినిర్దిశేత్ ॥

తా॥ పుత్రస్థానముకు పంచమమందు బృహస్పతియును, బృహస్పతికి పంచమమున సూర్యుడును, సూర్యునకు సప్తమమున కుజుడును యుండిన యడల ఒక కుమారుడు దయించును.

### స్త్రీసంతానాధికయోగః.

శ్లో॥ లగ్నాత్పుత్రగతేచంద్రే చంద్రాత్పంచమగేసితే । సితాత్పంచమగేసౌమ్యే స్త్రీప్రజాబహుళంభవేత్ ।

తా॥ లగ్నముకు అయిదవస్థానమందు చంద్రుడును, చంద్రునకు పంచమమున శుక్రుడును, శుక్రునకు పంచమమున బుధుడును, వున్నయడల స్త్రీసంతానమధికముగా జనించును.

### షట్పంచాష్ట సంఖ్యాపుత్రీయోగః.

శ్లో॥ సుతేశశశిశుక్రేషు స్త్రీరాశ్యంశగతేషుచ । తథైవకన్యకాలాభః పంచషట్సప్త సంఖ్యయా ।

తా॥ పుత్రస్థానాధిపతియు, చంద్రుడును, శుక్రుడును, స్త్రీ రాశులలోగాని, స్త్రీనవాంశలయందుగాని, వున్నయడల అయిదు, ఆరు, యెనిమిదిమంది కన్యలుగలుగును.

### పంచపుత్రీజననానంతరంపుత్రోత్పత్తిః.

శ్లో॥ స్త్రీరాశ్యంశగతేజీవే సుతేశేనయుతేక్షితే । కన్యకాజననాత్పంచ పుత్రోత్పత్తింవినిర్దిశేత్ ॥

తా॥ బృహస్పతి పుత్రస్థానాధిపతితో గూడిగాని, స్థానాధిపతిచేత చూడబడి యుండిగాని, స్త్రీరాశియందుగాని, స్త్రీనవాంశయందుగాని, యున్నయడల స్త్రీసంతానము, తరువాత అయిదుమంది పుత్రులుదయింతురు.

### సమసంఖ్యాక పుత్రీపుత్రః.

శ్లో॥ చంద్రేశుక్రాంశకగతే బుద్ధినాథేశనైశ్చరే । గురుణావీక్షితేయస్య తస్యపుత్రసమంభవేత్ ॥

తా॥ చంద్రుడు శుక్రనవాంశను పొందియుండగా శనిపుత్రస్థానాధిపతి యయి గురువుచేత చూడబడియుండిన యెడల పుత్రులును స్త్రీలును సమానముగాజనింతురు.

### కేవల స్త్రీసంతాన యోగః.

శ్లో॥ దారనాథ్యథవాథేచ శుక్రే సౌమ్యేథవావిధౌ। స్త్రీప్రజా జాయతేతస్య నపుత్రోజాయతేధ్రువమ్॥

తా॥ శుక్రుడుగాని, బుధుడు గాని, చంద్రుడు గాని, కళత్రస్థానాధి పతియైన యెడల కేవలము స్త్రీసంతానమే కలుగునుగాని పుత్రసంతానముగలుగదు.

### పంచపుత్రీయోగః.

శ్లో॥ రవావారవిపుత్రేవా స్త్రీరాశ్యంశగతేసుతే। సౌమ్యదృష్టియుతేవాపి పంచసంఖ్యాభవేత్ స్త్రియః॥

తా॥ సూర్యుడుగాని, శనిగాని, స్త్రీనవాంశనుబొంది పుత్రస్థానమందుండిబుధుని చేత చూడబడుచున్న యెడల అయిదుమంది కన్యకలుజనింతురు.

### పునర్వివాహేపుత్రయోగః.

శ్లో॥ పంచమాత్సప్తమేశుక్రే శుక్రాజ్జామిత్రగేరవౌ। వివాహాభ్యంతరేప్రాప్తే పుత్రలాభోన్యథాంభవేత్॥

తా॥ శుక్రుడు పంచమస్థానమునకు సప్తమమందును, శుక్రునకు సప్తమమందుసూర్యుడున్న యెడల మఱియొకవివాహమైన తరువాత ఆభార్యయందుసంతానము పుట్టును.

### అన్యబీజాత్పుత్రోత్పత్తిః.

శ్లో॥ శత్రుస్థానేస్థితేజీవే తన్నాథేపుత్రసంస్థితే। పాపదృష్టేన్యబీజేన పుత్రోత్పత్తింవినిర్దిశేత్॥

తా॥ బృహస్పతి షష్ఠస్థానమందుండగా షష్ఠస్థానాధిపతి పుత్రస్థానమందుండి పాపగ్రహముచేత చూడబడుచున్న యెడల తనభార్యయందు యితరబీజమువలన పుత్రప్రాప్తిగలుగును.

### ప్రకారాంతరేణాన్యబీజాత్పుత్రోత్పత్తిః.

శ్లో॥ రిపునాసంయుతేజీవే పుత్రస్థేరవిణేక్షితే। కుజదృష్టేన్యబీజేన పుత్రోత్పత్తింవినిర్దిశేత్॥

తా॥ బృహస్పతి శత్రుగ్రహముతో గూడి రవికుజులచేత చూడబడుచు పుత్రస్థానమందున్న యెడల యితరబీజములవలన సంతానముగలుగును.



శ్లో॥ లగ్నంచచంద్రలగ్నంచ నగురొవీక్షితేయది। హోరాధిపేపరాంశస్థే పరజాతోభవేత్సుతః॥

తా॥ జన్మలగ్నము చంద్రలగ్నమున్ను బృహస్పతిచేత చూడబడక యుండగా లగ్నాధిపతి యితరగ్రహాంశను బొందినయెడల పరులవల్ల పుత్రులుగలుగును.

శ్లో॥ చంద్రమర్కేణసంయుక్తం నవీక్షతిగురుర్యది। లగ్నాధిపేపరాంశస్థే పరజాతోభవేత్సుతః॥

తా॥ లగ్నాధిపతిఅన్యనవాంశను బొందియుండగా సూర్యునితోగూడినచంద్రుని గురువుచూడక యున్నయెడల పరునివలన సుతుడుజనించును.

### శూద్రబీజాత్సుతోత్పత్తిః.

శ్లో॥ నీచస్థానంగతేజీవే పుత్రేశేమకరేస్థితే। మందదృష్టియుతే శూద్రబీజేనైవ సుతోద్భవః॥

తా॥ బృహస్పతి నీచయందుండగా పుత్రస్థానాధి[illegible] మకర మందుండి శనిచేత చూడబడుచున్నయెడల శూద్రబీజమువలన పుత్రులుగలుగు[illegible].

శ్లో॥ పుత్రేశేనీచరాశిస్థే కారకేకుంభరాశిగే। నవమేరాహుసంయుక్తే శూద్రబీజాత్సుతోద్భవః॥

తా॥ పుత్రస్థానాధిపతి నీచయందును పుత్ర కారకుడగు బృహస్పతి కుంభమందుండగా రాహువు నవమమందున్నయెడల శూద్రబీజమువల్ల సుతుడుకలుగును.

### పుష్పిణ్యాం పుత్రోత్పత్తిః.

శ్లో॥ నీచరాశిగతేసూర్యే సూర్యాత్పంచమగేగురౌ। చంద్రాత్పంచమగేరాహౌ పుష్పిణ్యాంజాయతేసుతః॥

తా॥ సూర్యుడు నీచయందుండగా సూర్యునకు పంచమందు గురువుండి చంద్రునకుపంచమమున రాహువుండినయెడల రజస్వలయందు పుత్రోదయమగును.

### నీచాత్పుత్రజననః.

శ్లో॥ పుత్రస్థానాధిపేజీవే నీచేనసహితేసుతే। షష్ఠస్థితేనసూర్యేణ దృష్టేనీచాత్సుతోద్భవః॥

తా॥ పుత్రస్థానమందు నీచగ్రహముండగా బృహస్పతి పుత్రస్థానాధిపతియై దశమమందున్న రవిచేత చూడబడుచున్నయెడల నీచునివలన పుత్రుడుగలుగును.

ప్రకారాంతరేణ నీచాత్పుత్రప్రాప్తిః.

శ్లో॥ అలిస్థితేవిధౌయస్య సుతేకేతుయుతేథవా । శుభదృష్టివిహీనేచ నీచబీజాత్సుతోద్భవః॥

తా॥ వృశ్చికమందు చంద్రుఁడుండి పంచమమందు కేతువుండి శుభగ్రహములచేత చూడఁబడకయున్న యెడల నీచునివలన పుత్రోదయము కలుగును.

పుష్పిణ్యామన్యబీజాత్పుత్రోత్పత్తిః.

శ్లో॥ లగ్నరాశిస్థితేభౌమే భాగ్యాధిపసమన్వితే । కారకేవ్యయరాశిస్థే పుష్పిణ్యామన్యబీజజః॥

తా॥ అంగారకుఁడు నవమాధిపతితోఁ కలసిలగ్నమందుండఁగా పుత్రకారకుఁడువ్యయమందున్నయెడల రజస్వలయైన భార్యయందన్యబీజమువలన పుత్రోదయమగును.

శ్లో॥ ఇత్యుక్తందేవిపుత్రాదే పరమంలక్షణంరహః । గోప్యంత్వయాతుతచ్ఛోక్తం సుతప్రాప్తిర్భవిష్యతి॥

తా॥ ఓ పార్వతీ ఈప్రకారముగా పుత్రప్రాప్తి చెప్పఁబడియున్నది యిదిరహస్యముగాన దీని నెచ్చటను చెప్పకుము నీకు పుత్రలాభముగలుగును.

ఇతి సంతానరత్నాకరే తృతీయపటల స్సమాప్తః.

---

అథ చతుర్థ పటల ప్రారంభః.

దత్తపుత్రాదియోగః.

శ్లో॥ అతఃపరంప్రవక్ష్యామి దత్తపుత్రాదిలక్షణమ్ । శ్రుణుధ్వం శ్రద్ధయాదేవి త్వం సుతంప్రాప్స్యసిధ్రువమ్॥

తా॥ ఓపార్వతీ తరువాత దత్తపుత్రాదిలక్షణమును చెప్పెదను వినుము శ్రద్ధగా వినినయెడలనీకు పుత్రుఁడుగలుగును.

శ్లో॥ పుత్రస్థానేబుధక్షేత్రే మందక్షేత్రేథవాభవేత్ । మందమాందియుతేదృష్టే తదాదత్తాదయస్సుతాః॥

తా॥ పుత్రస్థానము బుధక్షేత్రముగాని శనిక్షేత్రముగాని అయివుండి అచ్చట శనియు మాంది(గుళిక)గ్రహముండినగాని లేక చూచినగాని దత్తులుసంభవించుదురు గాని ఔరసులు పుట్టరు.



దత్తపుత్రయోగః.

శ్లో॥ సంపూర్ణబలసంయుక్తః పుత్రస్థానగతశ్శుభః । అదృష్టః పుత్రనాథేన తదాదత్తాదయస్సుతాః॥

తా॥ పుత్రస్థానమందు శుభగ్రహముండి పుత్రస్థానాధిపతిచేత చూడఁబడకున్న యెడల దత్తాదులే పుత్రులగుదురు.

మృతపుత్రయోగః.

శ్లో॥ మృగమత్స్యగతేజీవే పుత్రస్థానాధిపేవ్యయే । కర్కటసంస్థే బుధేయస్య తస్యపుత్రోమృతోభవేత్॥

తా॥ మకర మీనములందు బృహస్పతియు, పుత్రస్థానాధిపతి ద్వాదశమందును, బుధుఁడు కర్కాటకమందును, వున్నయెడల పుత్రుఁడుమృతినొందుననుట.

పునఃప్రకారాంతరేణదత్తపుత్రయోగః

శ్లో॥ మేషాత్పంచమగేమందే సూర్యేషష్ఠాష్టమవ్యయే । కారకేబలహీనేచ దత్తపుత్రోభవేద్ధ్రువమ్॥

తా॥ శని మేషమునకు పంచమమందును, సూర్యుఁడు ౬-౮-౧౨ స్థానములందును వుండఁగా పుత్రకారకుఁడు బలహీనుఁడైయినంతలో దత్తపుత్రయోగముగలుగును.

శ్లో॥ వృషాత్పంచమగేసౌమ్యే కామేచంద్రేవ్యయేసురా । ధర్మాధిపేవ్యయేనీచే దత్తపుత్రోభవిష్యతి॥

తా॥ బుధుఁడు వృషభమునకు పంచమమందుండి, చంద్రుఁడు సప్తమమందును గురువు ద్వాదశమందును నవమాధిపతి నీచయందుండి ద్వాదశమందుండఁగా దత్తపుత్రయోగముకలుగును.

శ్లో॥ నృయుగ్మాత్పంచమేసూర్యే శుక్రేకన్యాగతేయదా । దృష్టిహీనేసుతస్థానే గురోర్దత్తాదయస్సుతాః॥

తా॥ తులయందు రవియు, కన్యయందు శుక్రుఁడుండఁగా పంచమస్థానమునకు బృహస్పతి వీక్షణము లేకుండినయెడల దత్తపుత్రయోగముకలుగును.

శ్లో॥ కుళీరాత్పంచమేచంద్రే భౌమేషష్ఠాష్టసంస్థితే । శుభాధిపే గురౌనీచే దత్తయోగాత్సుతంలభేత్॥

తా॥ వృశ్చికమందు చంద్రుఁడును, అంగారకుఁడు ౬-౮స్థానములందునుయుండఁగా బృహస్పతి శుభరాశ్యధిపతియై నీచయందున్నయెడల దత్తపుత్రయోగము కలుగును.

శ్లో॥ మృగేశాత్పంచమేశుక్రే కామేరాహుసమన్వితే। కారకేరిష్ఫసంస్థేచ దత్తయోగాత్సుతంలభేత్॥

తా॥ మకరమందు సూర్యుడును, సూర్యునకు పంచమమున శుక్రుడును, సప్తమమందు రాహువును, పుత్రకారకుడు ద్వాదశమందుండగా దత్తపుత్రయోగము కలుగును.

శ్లో॥ అంగనాత్పంచమేసౌమ్యే లగ్నాత్కామేధరాసుతే। కారకేమేషసంస్థేచ దత్తపుత్రోభవిష్యతి॥

తా॥ కన్యారాశికి పంచమమున బుధుడును, లగ్నమునకు సప్తమమున కుజుడును, యుండగా పుత్రకారకుడు మేషమందుండినయెడల దత్తపుత్రయోగము కలుగును.

శ్లో॥ జూకలగ్నాద్ద్వారగతే మాందాఖ్యేగమతేగురౌ। పుత్రేనన్యస్యభావస్థే తస్యదత్తాదయస్సుతాః॥

తా॥ తులాలగ్నమునకు సప్తమమున గుళికగ్రహమును, దశమమున గురువును, యుండగా పుత్రస్థానాధిపతియితరగ్రహరాశియందున్న యెడల దత్తపుత్రయోగముకలుగును.

దత్తస్వీకారాత్పరం ఔరసజననం.

శ్లో॥ వృశ్చికాన్నవమాధీశే పుత్రసంస్థేవ్యయేగురౌ। పుత్రస్థానేశుభైర్దృష్టే భౌమయుక్తేథవీక్షితే। పరంతుపుత్రస్వీకార దౌరసోజాయతేసుతః॥

తా॥ వృశ్చికమునకు నవమరాశ్యధిపతి పుత్రస్థానమందును, గురువు ద్వాదశమందును యుండగా పుత్రస్థానము శుభగ్రహములచేత చూడబడుచు అంగారకునితో గూడి యుండిగాని చూడబడిగాని యున్నయెడల దత్తస్వీకారానంతరము పుత్రప్రాప్తికలుగును

శ్లో॥ వృశ్చికాత్పంచమేచంద్రే చంద్రాత్పంచమగేబుధే। కారకేబలంయుక్తే పరంపుత్రోభవిష్యతి॥

తా॥ వృశ్చికమునకు పంచమమున చంద్రుడును, చంద్రునకు పంచమమున బుధుండును వుండగా పుత్రకారకుడు బలవంతుడయి యుండెనేని దత్తస్వీకారానంతరము పుత్రప్రాప్తిగలుగును.

పునః ప్రకారాంతరేణ దత్తపుత్రయోగః.

శ్లో॥ కార్ముకాత్షష్టగేభౌమే కామేశేవ్యయగేబుధే। సురేడ్యేరిఃఫరంధ్రారి సంస్థేదత్తాదయస్సుతాః॥

తా॥ ధనస్సునకు ఆరింట కుజుడును, సప్తమాధిపతియైన బుధుడుద్వాదశమందుండగా గురువు ౬-౮-౧౨- స్థానములందుండినయెడల దత్తపుత్రయోగము కలుగును.



శ్లో॥ మకరస్యభవాల్లగ్నాత్పంచమేమందభూమిజే। కారకేబలహీనేచ దత్తపుత్రోభవిష్యతి॥

తా॥ మకరలగ్నమయి దానికి పంచమమున కుజశనులుండగా పుత్రకారకుడుబలహీనుడయి యుండినయెడల దత్తపుత్రయోగముకలుగును.

పునఃపుత్రస్వీకారాత్పరం ఔరసయోగః.

శ్లో॥ కారకేబలసంయుక్తే శుభగ్రహనిరీక్షితే। పరంతుపుత్రస్వీకారా దౌరసోజాయతేసుతః॥

తా॥ పుత్రకారకుడు బలవంతుడయి శుభగ్రహములచేత చూడబడుచున్నయెడల దత్తస్వీకారానంతరము పుత్రప్రాప్తికలుగును.

దత్తపుత్ర యోగః.

శ్లో॥ కుంభలగ్నాత్సుతేసూర్యే సూర్యాత్కామేశనైశ్చరే। సుతేశేపాపసంయుక్తే ధృవంపుత్రోథదత్తకః॥

తా॥ సూర్యుడు కుంభలగ్నమునకు పంచమమున వుండి, సూర్యునకు సప్తమమున శని యుండి, పుత్రస్థానాధిపతి పాపగ్రహములతో గూడి యున్నయెడల దత్తపుత్రయోగము కలుగును.

దత్తపుత్రమరణయోగః.

శ్లో॥ తృతీయలాభరంధ్రస్థే సుతేశేవ్యయసంస్థితే। తస్యావసానసమయే దత్తపుత్రోమరిష్యతి॥

తా॥ ౩-౮-౧౧-౧౨ స్థానములలో నెచ్చటనయినను పుత్రస్థానాధిపతి యున్నయెడల జాతకునకు అవసానకాలమమున దత్తపుత్రుడు మృతినొందును.

దత్తపుత్రశత్రుయోగః.

శ్లో॥ సుతేశేరిఃఫసంస్థే చరిపునాథయుతేపిచ గురుదృష్టివిహీనేచదత్తపుత్రోరిపుర్భవేత్॥

తా॥ పుత్రస్థానాధిపతి గురుదృష్టివిహీనుడయి ద్వాదశమందున్నను, షష్ఠస్థానాధిపతితో గూడియున్నను దత్తపుత్రుడు శత్రువుగానుండును.

పునర్దత్తమరణయోగః.

శ్లో॥ పుత్రనాథేవ్యయస్థేవా కామేశేనయుతేపివా। కారకేతుబలైర్హీనే దత్తపుత్రోపిమృత్యుభాక్॥

తా॥ పుత్రస్థానాధిపతి వ్యయమందున్నను, సప్తమాధిపతితో గూడియున్నను, పుత్రకారకుడు బలహీనుడయియుండెనేని దత్తపుత్రుడు మృతినొందును.

పునర్దత్తపుత్రయోగః.

శ్లో॥ మీనలగ్నాత్సుతాధీశే భాగ్యే భాగ్యాధిపే వ్యయే। కారకే శత్రురాశిస్థే దత్తపుత్రో భవిష్యతి॥

తా॥ మీనలగ్నమునకు పంచమాధిపతి భాగ్యస్థానమందును, భాగ్యస్థానాధిపతి ద్వాదశమమున వుండగా పుత్రకారకుడు శత్రురాశియందున్న యెడల దత్తపుత్ర యోగము కలుగును.

అపత్కాలేదత్తమృతియోగః.

శ్లో॥ పంచేమేసపమేపాపా కారకోదుర్బలోయది। తస్యాపత్కాలసమయే దత్తపుత్రోమరిష్యతి॥

తా॥ ౫-౭ స్థానములందు పాపగ్రహములుండగా పుత్రకారకుడు బలహీనుడయియుండెనేని జాతకునకు ఆపత్కాలమందు దత్తపుత్రుడు మృతినొందును.

దత్తపుత్రమృతిదోష ప్రాయశ్చిత్తః.

శ్లో॥ ప్రాయశ్చిత్తంకృతంచేత్స్యాద్దాయుష్మంతంసుతంలభేత్। శంకరస్యవచశ్శ్రుత్వా దేవీప్రోవాచసాదరమ్॥

తా॥ ఓపార్వతీ యిట్టిదత్తపుత్రమృతియోగము కలిగియున్న జాతకుడుప్రాయశ్చిత్తము చేసికొన్నయెడల కుమారుడుదీర్ఘాయుష్మంతుడగును యిట్లుశివుడు చెప్పగా విని పార్వతి అడుగుచున్నది.

శ్లో॥ కథంతుశివకర్తవ్యం ప్రాయశ్చిత్తంవదప్రభో। ఇతిదేవ్యా వచశ్శ్రుత్వా పునఃప్రోవాచశంకరః॥

తా॥ ఓశంకరా ఆప్రాయశ్చిత్తమెట్లు చేయవలయునోచెప్పుము యిట్లనిపార్వతి అడుగగా శివుడు చెప్పుచున్నాడు.

అథ శివపూజాప్రకారః

శ్లో॥ దత్తపుత్రలయస్యాస్యప్రాయశ్చిత్తంశ్రుణుష్వభో॥ఏకాబ్ద శివపూజాతు కర్తవ్యానియమేనవై॥

తా॥ ఓపార్వతీ వినుము దత్తపుత్రునకు మృతియోగమున్నవాడువకసంవత్సరము శివపూజ చేయవలయును.



శ్లో॥ ప్రాతరుత్థాయసుస్నాత్వా కృత్వాసంధ్యాజపాదికమ్। సంకల్ప్యవిధివత్తత్ర తద్దోషవినివర్తయే॥

తా॥ ఉదయాననేలేచి స్నానముచేసి సంధ్యావందనాది నిత్యకర్మను నెరవేర్చి దత్తపుత్రమరణయోగ నివృత్తికై సంకల్పముజేయవలయును.

శ్లో॥ ఇతిధ్యాత్వాముదాలింగం కృత్వాగణపతింతదా। ఆవాహ్యవిధివత్పూజాం కృత్వామౌనీజితేంద్రియః॥

తా॥ తరువాత గణపతిని శివలింగమునుచేసి మౌనియై జితేంద్రియుడైఆప్రతిమలందు శివగణపతులను పూజించవలయును.

శ్లో॥ షోడశైరుపచారైశ్చ సద్యోజాతాదిమంత్రకైః పంచాక్షరేణమంత్రేణ బిల్వైరభ్యర్చయేత్తిలైః॥ సాక్షతైశ్శతరుద్రైశ్చ అభిపూజ్యయథావిధి। ప్రదక్షిణనమస్కారాన్కృత్వాభక్తిసమన్వితః॥ స్తుత్వాచవివిధైస్తోత్రైస్థిత్వాధ్యాత్వాసదాశివమ్॥

తా॥ సద్యోజాతాది మంత్రములచేతను, శివపంచాక్షరీ మంత్రములచేతను, బిల్వపత్రములతోను, తిలలతోను, షోడశోపచారములతో పూజించవలయును, అక్షతలతో పూజింపవలయును, నమకముతో అభిషేకము చేయవలయును, తరువాత ప్రదక్షిణ నమస్కారములుజేసి, అనేక స్తవములచేత స్తుతించి శివునిధ్యానించవలెను.

శ్లో॥ దేవదేవమహాదేవ వృషభధ్వజశంకర। ఆయుష్యం దేహి మే పుత్రం కురుకాలనివారణమ్॥

తా॥ ఓ దేవదేవా, మహాదేవా, వృషభధ్వజ, శంకరా, నాకుమారునకు అకాల మృత్యువును నివారించి ఆయుష్యమునుయిమ్ము.

శ్లో॥ మనుజన్మార్జితంపాపం అనివార్యమపిప్రభో। నివార్యసర్వపాపాని పుత్రస్యాయుఃప్రదోభవ॥

తా॥ నేనుపూర్వజన్మమున చేసినపాతకములు నశింపజేయ శక్యములుగానివైనను నీవునాయందనుగ్రహముచేత నశింపజేసి నాకుమారునకు ఆయుష్యమునిమ్ము

శ్లో॥ ఇతిసంప్రార్థ్యదేవేశం పూజామబ్దంకరోతిచేత్। ప్రాప్నుయాచ్చతదాయుష్యం దత్తపుత్రస్యతత్క్షణాత్॥

తా॥ ప్రతిదినము యిట్లు ప్రార్థించుచు సంవత్సరము పూజించిన యడల దత్త పుత్రునకు దీర్ఘాయుష్యము కలుగును.

శ్లో॥ వర్షాంతేనాపి కర్తవ్యం సఘృతం దక్షిణాయుతమ్। ఏవం కృతం చేత్తస్యాయు ర్జాయతే శతసంఖ్యయా॥

తా॥ యిట్లు సంవత్సరము పూజించి వత్సరాంతమందు మంచి మనస్సుతో పది కొండుమందికి తక్కువలేకుండా బ్రాహ్మణులకు నేయి భక్ష్యములతోను సమారాధన చేసి దక్షిణలిచ్చి వారివలన కుమారుని ఆశీర్వాదమును గ్రహించినయడల ఆదత్తపుత్రునకు నూరుసంవత్సరములు ఆయువుగలుగును.

ఇతి సంతానరత్నాకరే చతుర్థపటల స్సమాప్తః.

---

అథ పంచమపటల ప్రారంభః.

అనపత్యలక్షణప్రతిపాదకమ్.

శ్లో॥ అథాతస్సంప్రవక్ష్యామి అనపత్యస్యలక్షణమ్। శృణుష్వ శ్రద్ధయాదేవి గిరిజేసుతవృద్ధిదమ్॥

తా॥ ఓ పార్వతీ వినుము తరువాత అనపత్యలక్షణమును చెప్పెదను శ్రద్ధగా విన్నయడల సంతానలాభము కలుగును.

అపుత్రయోగః.

శ్లో॥ గురులగ్నేశదారేశ పుత్రస్థానాధిపేషుచ। సర్వేషుబలహీనేషు వక్తవ్యాత్వనపత్యతా॥

తా॥ బృహస్పతి, లగ్నాధిపతి, సప్తమాధిపతి, పుత్రస్థానాధిపతి, యీ నలుగురు బలహీనులై యున్న యడల సంతానము గలుగదు.

ప్రకారాంతరేణ అపుత్రయోగః.

శ్లో॥ పుత్రస్థానంగతే పాపే తదీశేనీచసంస్థితే। శుభదృష్టివిహీనేచ వక్తవ్యాత్వనపత్యతా॥

తా॥ పాపగ్రహము పంచమమందుండి ఆపంచమాధిపతి శుభగ్రహసంబంధములేక నీచయందున్నయడల సంతానము గలుగదు.

వా॥ పాపద్వయమధ్యగతేజీవే పుత్రాధిపేచబలహీనే।సుతభేత్వశుభయుతే సంతతినాశోవినిర్దేశ్యః॥



తా॥ పంచమమున పాపగ్రహములును, పంచమాధిపతి బలహీనుడుగానుండి గురువు రెండుపాపగ్రహములమధ్యనున్న యడల సంతానముగలుగదు.

శ్లో॥ నీచారిమౌఢ్యోపగతేసుతేశే రిఃఫారిరంధ్రాధిపసంయుతేవా। సుతస్యనాశోకథితోత్రిదజ్ఞైః శుభైరదృష్టేసుతభేసుతేశే॥

తా॥ పంచమముగాని, పంచమాధిపతిగాని, శుభగ్రహములచేత చూడబడకయుండగా పంచమాధిపతి నీచను బొందినను, శత్రుక్షేత్రయైనను, మౌఢ్యమును బొందినను, ౬-౮-౧౨ స్థానములకధిపతితో జేరినను సంతానముగలుగదు.

శ్లో॥ పంచమేనవమేపాపే తదీశేనీచసంస్థితే। కారకేనీచరాశిస్థే వక్తవ్యాత్వనపత్యతా॥

తా॥ పంచమ నవమములందు పాపగ్రహములుండి ఆపంచమనవమాధిపతి నీచయందుండగా పుత్రకారకుడు నీచరాశియందున్నయడల సంతానముగలుగదు.

శ్లో॥ మేషసింహాళినక్రేషు రాశ్యేకానవమోభవేత్। తదీశేన యుతేక్లీబే వక్తవ్యాత్వనపత్యతా॥

తా॥ మేష, సింహ, వృశ్చిక, మకరములలో నొకటి నవమ రాశియై ఆనవమస్థానాధిపతి నపుంసకగ్రహముతో గూడియున్నయడల సంతానముగలుగదు.

శ్లో॥ వ్యయస్థేలగ్నపేమందే కామేశేరిపురాశిగే। కామేశేనాశరాశిస్థే వక్తవ్యాత్వనపత్యతా॥

తా॥ లగ్నాధిపతియైన శనిద్వాదశమందుండగా సప్తమాధిపతి అష్టమమునశత్రుక్షేత్రమందున్నయడల సంతానముగలుగదు.

శ్లో॥ పుత్రస్థానాధిపేసూర్యే వ్యయేనీచయుతేక్షితే। కారకే మౌఢ్యరాశిస్థే వక్తవ్యాత్వనపత్యతా॥

తా॥ సూర్యుడు పుత్రస్థానాధిపతియై ద్వాదశమందు నీచగ్రహముతో గూడియున్నను నీచగ్రహముచేత చూడబడుచున్నను పుత్రకారకుడు అస్తంగతుడయియుండిన యడల సంతానముగలుగదు.

శ్లో॥ సుతస్థానాధిపేచంద్రే సౌమ్యయుక్తవ్యయస్థితే। కారకే రంధ్రరాశిస్థే వక్తవ్యాత్వనపత్యతా॥

తా॥ చంద్రుడు పుత్రస్థానాధిపతియై బుధునితో గూడి ద్వాదశమందుండగా పుత్రకారకుడు అష్టమముననున్నయడల సంతానముగలుగదు.

శ్లో॥ సుతస్థానాధిపేభౌమే జామిత్రే శనిసంయుతే । తద్వయే కారకేజీవే వక్తవ్యాత్వనపత్యతా॥

తా॥ కుజుడు పుత్రస్థానాధిపతియై సప్తమమున శనితోగూడియుండగా పంచమ సప్తమమున పుత్రకారకుడున్నయడల సంతానముగలుగదు.

శ్లో॥ సుతస్థానాధిపేసౌమ్యే భౌమక్షేత్రేరిపుగ్రహే । తద్వయే మందసంయుక్తే వక్తవ్యాత్వనపత్యతా॥

తా॥ బుధుడు పుత్రస్థానాధిపతియై మేషవృశ్చికములలోగాని, శత్రుక్షేత్రమందుగాని యుండగా శని ఆస్థానములందున్నయడల సంతానముగలుగదు.

శ్లో॥ సుతస్థానాధిపేజీవే శుక్రయుక్తేవ్యయస్థితే । పాపదృష్టియుతేలగ్నే వక్తవ్యాత్వనపత్యతా॥

తా॥ గురువు పుత్రస్థానాధిపతియై శుక్రునితో గూడి ద్వాదశమమున నుండగా లగ్నము పాపగ్రహదృష్టమైనయడల సంతానముగలుగదు.

శ్లో॥ సుతస్థానాధిపేశుక్రే నీచరాశిసమన్వితే । కారకేమాధ్యరాశిస్థే వక్తవ్యాత్వనపత్యతా॥

తా॥ శుక్రుడు పుత్రస్థానాధిపతియై నీచరాశియందుండగా పుత్రకారకుడు అస్తమించినయడల సంతానముగలుగదు.

బ్రహ్మహత్యాదిదోషః.

శ్లో॥ సుతస్థానేదోషయుక్తే నృణాంపంచభవేకృతాం । బ్రహ్మహత్యాసముత్పన్నా మనపత్యత్వతాంవ్రజేత్॥

తా॥ పుత్రస్థానము బహుదోషయుక్తముగా నున్నయడల జాతకుడు అయిదు జన్మములందు జేసిన బ్రహ్మహత్యాదిదోషములవలన సంతానము పొందడని తెలుసుకొనవలయును.

శ్లో॥ సుతస్థానాధిపేమందే భాగ్యస్థేరవిసంయుతే । కుజదృష్టియుతేపుత్రే వక్తవ్యాత్వనపత్యతా॥

తా॥ శని పుత్రస్థానాధిపతియై భాగ్యమందు రవితోగూడి యుండగా పుత్రస్థానమును అంగారకుడు చూచుచుండినయడల సంతానముగలుగదు.

శ్లో॥ పాపమధ్యగతేలగ్నే పాపమధ్యగతేసుతే । పాపమధ్యగతేదారే సంతతిస్తునజాయతే॥



తా॥ జన్మలగ్నమును, పుత్రస్థానమును, సప్తమస్థానమును, పాపగ్రహములమధ్య నున్నయడల సంతానముగలుగదు.

ప్రాయశ్చిత్తానుష్ఠానేప్యపుత్రయోగః.

శ్లో॥ కథితంతుమయాదేవి హ్యనపత్యస్యలక్షణం । ప్రాయశ్చిత్తశతేనాపి నసుతోజాయతేనృణామ్॥

తా॥ ఓపార్వతీ యీప్రకారముగా సంతానాభావలక్షణమును చెప్పినాను యిట్టి లక్షణములుగల జాతకుడు యెన్నిప్రాయశ్చిత్తములుచేసినను సంతానముగలుగదు.

ఇతి సంతానరత్నాకరే పంచమపటలస్సమాప్తః.

---

అథ షష్ఠపటలప్రారంభః.

రేతస్కన్నలక్షణప్రతిపాదకః.

శ్లో॥ అథాతస్సంప్రవక్ష్యామి స్కన్నదోషంహిగర్భతః । పితృశాపాత్తుసంప్రాప్తం శృణుష్వార్యేసుతప్రదమ్॥

తా॥ ఓపార్వతీ తరువాత పిత్రాది శాపమువలనగలిగినగర్భస్కన్నదోషమును చెప్పెదనువినుము వినినయడల సంతానముగలుగును.

శ్లో॥ లగ్నేశస్థిరరాశీశో రాహుణాసహితోయది । మైథునేస్కన్నతాంరేతో వ్రజేచ్చాగర్భతామసాత్॥

తా॥ లగ్నాధిపతియున్న రాశినాథుడు రాహువుతోగూడియున్న యడలసంభోగమందు విడిచిన వీర్యము గర్భములోనికిపోయి గర్భమును ధరించుటలేదు.

పితృశాపాద్వీర్యస్కన్నయోగః.

శ్లో॥ సుతనాథేరిసంస్థేచ చంద్రేణసహితేక్షితే । కారకేవ్యోమ్నిగేస్కన్నం పితృశాపాద్భవిష్యతి॥

తా॥ పంచమాధిపతి చంద్రునితోగూడిగాని, చంద్రునిచేత చూడబడుచుగాని షష్ఠస్థానమందుండగా పుత్రకారకుడు దశమమందున్న యడల పితృశాపము వలన గర్భము చెడిపోవును.

ప్రకారాంతరేణ వీర్యస్కన్నయోగః.

శ్లో॥ నవమాధిపతౌలగ్నే వ్యయేశసహితేమృగే । మందదృష్టియుతేస్కన్నం పితృశాపాద్భవిష్యతి॥

తా॥ నవమాధిపతి లగ్నమునను ద్వాదశాధిపతి మకరమమునుండి శనిచేత చూడబడుచున్న యెడల పితృశాపమువలన గర్భముజారిపోవును.

శ్లో॥ పంచమాధిపతౌ కామే కామే శేరిఃఫగేబుధే। పాపదృష్టియుతేస్కన్నం పితృశాపాద్భవిష్యతి॥

తా॥ పంచమాధిపతి సప్తమమునను సప్తమాధిపతి ద్వాదశ మమునుండి బుధుడు పాపగ్రహదృష్టుడౌచుండగా పితృశాపమువలన వీర్యముస్కన్నమగును.

శ్లో॥ జాయాస్థానాధిపేక్రూరే సుతేశేనయుతేక్షితే। జాయాయారజసోత్పత్తే ర్బాధాస్యాదుదరేఽబహు॥

తా॥ సప్తమాధిపతి పాపగ్రహమయి పుత్రస్థానాధిపతితో గూడియున్నను లేక చూడబడియున్నను భార్యకు రజస్సుజనించుకాలమున బాధగలుగుచుండును

శ్లో॥ కామేశేరిపుభావస్థే రిపునాథేవిలగ్నగే। రజఃప్రాదుర్భవాత్తస్య జాయాయాఉదరేవ్యథా॥

తా॥ సప్తమాధిపతి షష్ఠమందును, షష్ఠాధిపతి లగ్నమమున నున్నయెడల ఆ పురుషునిచే రేతస్సువలన భార్యకు బాధగలుగుచుండును.

శ్లో॥ కామేశేసుతభావస్థే సుతేశేచంద్రసంయుతే। వ్యయస్థేరజసఃప్రాక్స్యాత్పరంవాప్యుదరవ్యథా॥

తా॥ సప్తమాధిపతి పంచమమునను పంచమాధిపతి చంద్రునితోచేరి ద్వాదశమమున నున్నయెడల రజస్సుపుట్టుటకుముందుగాని, పుట్టినపిమ్మటగాని ఉదరమందువ్యథగలుగును

శ్లో॥ సుతస్థానాధిపేభౌమే జయానాథయుతేక్షితే। భక్షితంక్రిమిభిస్తత్ర రేతోగర్భభవేన్నృణామ్॥

తా॥ పుత్రస్థానాధిపతి కుజుడయి సప్తమాధిపతితోగూడినను లేక సప్తమాధిపతిచేత చూడబడినను గర్భమమున రేతస్సును పురుగులు భక్షించును.

శ్లో॥ నవమేపాపసంయుక్తే దారేపాపసమన్వితే। గురౌపాపేనసంయుక్తే క్రిమిరూపోపజాయతే॥

తా॥ సప్తమ నవమస్థానములు పాపగ్రహములతో గూడియుండగా బృహస్పతి పాపగ్రహముతో గూడినయెడల గర్భమందు క్రిమిరూపము పురుగుల గుంటు కలుగును.

శ్లో॥ ఏవమాదిమహద్బాధా పితృశాపాత్సముద్భవేత్। తద్దోషపరిహారార్థం ప్రాయశ్చిత్తంకరోతిచేత్॥ గర్భంధృత్వాసుతంలబ్ధ్వా పరంముదమవాప్నుయాత్॥



తా॥ ఈమొదలగుబాధలు పితృశాపమువలన గలుగుచుండును ఆదోషమునశించుకొఱకు చెప్పబోవుప్రకారముగా ప్రాయశ్చిత్తమునుచేసినయెడల పాపములునశించిగర్భమునుధరించి కుమారునిగని సంతోషమునొందును.

శ్లో॥ ఇతిశ్రుత్వాశుభంవాక్యం శంకరస్యముఖాచ్చ్యుతమ్। ప్రపచ్ఛపరయాభక్త్యా పునస్తంమేనకాత్మజా॥

తా॥ ఇట్లుశంకరుడు చెప్పగావిని పార్వతీదేవి నమస్కరించి ఆ ప్రాయశ్చిత్తమును చెప్పుమనికోరెను.

పితృశాపనివారణప్రాయశ్చిత్తప్రకారః.

శ్లో॥ దేవివక్ష్యామి తేప్రీత్యా పితృశాపస్యమోచనమ్। శాంతించనైజమేషాఖ్యాం కుర్యాత్తన్మోచనేగజే॥

తా॥ ఓ నాప్రియానీయందు అతిప్రేమచేత నీకుపితృశాపమోచన ప్రాయశ్చిత్తమును చెప్పెదనువినుము పితృశాపనివృత్తికై నైజమేషమనుశాంతినిజేయవలయును.

నైజమేష యంత్రోద్ధా

శ్లో॥ యంత్రంకృత్వానైజమేషం పూజయేన్మండలంశుభమ్। మండలాంతేతువిప్రాయ దద్యాత్తందక్షిణాయుతమ్॥ పితృశాపంవిముచ్యైత సుతపుత్రంలభతేధృవమ్॥

తా॥ నైజమేషయంత్రమును చేయించి నలభై రోజులు పూజించి చివరకు దక్షిణతోగూడా ఆయంత్రమును బ్రాహ్మణునకిచ్చిన యెడల పితృశాపమోచన మగునని తా॥

శ్లో॥ యంత్రక్రమంచవక్ష్యామి శృణుపార్వతిభక్తితః। సువర్ణేహ్యథవారౌప్యే తామ్రేవాష్టనిష్కకైః॥

తా॥ నైజమేషయంత్రక్రమమును చెప్పెదను వినుము బంగారముగాని వెండిగాని రాగిగాని యెనిమిదినిష్కములయెత్తు తెచ్చి దానియందు యీయంత్రమును నిర్మించవలయును నిష్కలక్షణముముందు చెప్పబడుచున్నది.

శ్లో॥ జాలసూర్యమరీచిస్థం రజోరేణురితిస్మృతమ్। తేష్టాలీక్షాతు తాస్తిస్రః రజస్సర్షపఉచ్యతే॥ తేష్టాయవమితిప్రోక్తం తేష్టామాషఇతిస్మృతమ్। మాషషోడశకంవింద్యాత్ స్వర్ణకంకర్షస్తుషోడశ॥ తేష్టానిష్కమితిప్రోక్తం తేనయంత్రంతుకారయేత్॥

తా॥ కిటికిలోనుంచి ప్రసరించు సూర్యకిరణములోని పరాగము రేణువనబడును, అట్టిరేణువులు యెనిమిదయిన యొకలిక్షమనబడును, ఆలిక్షములు మూడుగలసిన సర్షప

మనబడును, ఆసర్వర్ణపములు యెనిమిది యొక్కయవయవనబడును, యెనిమిది యవలు యొక్క మావమనబడును, పదహారు మావములు స్వర్ణమనబడును, పదహారుస్వర్ణములు కర్షమనబడును, యెనిమిది కర్షములు నిష్కమనబడును.

శ్లో॥ లిఖిత్వాప్రణవంమధ్యే త్రికోణంతద్బహిఃక్రమాత్। తద్బహిఃపంచకోణంస్యాద్వృత్తత్రయమథాలిఖేత్॥

తా॥ అట్టినిష్కములు యెనిమిదితో యంత్రమును చేయించవలయును, యంత్రవిధానము మధ్యను ఓంకారము, దానికి బయిట త్రికోణము,దానికిబయిట పంచకోణము, దానికిబయిట మూడువృత్తములు వ్రాయవలయును.

శ్లో॥ ప్రణవేకామబీజంతు లిఖిత్వావిష్ణుబీజకమ్। త్రికోణేవిలిఖేత్పశ్చాత్పంచకోణేయథాక్రమమ్॥

తా॥ ప్రణవార్థమేర్పరచిన వృత్తమందును,త్రికోణమందును,పంచకోణమందును, మూటియందును, మన్మథబీజమును, విష్ణుబీజమును, వ్రాయవలెను.

శ్లో॥ నైజమేవమహాయంత్రం ప్రత్యహంపూజయేచ్ఛుచిః। దశాసంతర్పయేన్నిత్యం మంత్రిసాహస్యసంఖ్యయా॥

తా॥ ఇట్టువ్రాసి ప్రతిరోజును పూజించుచు మూలమంత్రమును దినమునకువేయి చొప్పున జపించుచు చివరకు జపదశాంశము తర్పణచేయవలయును.

శ్లో॥ తద్దశాంశంహునేత్పశ్చాద్దశాంశంద్విజభోజనమ్।యంత్రం విప్రాయదాతవ్యం యథావిత్తానుసారతః॥

తా॥ తరువాత తర్పణదశాంశము హోమముచేయవలయును, హోమదశాంశము బ్రాహ్మణభోజనము పెట్టవలయును, యంత్రమును దక్షిణతోసహా బ్రాహ్మణునకుదాన మివ్వవలయును.

శ్లో॥ కామయంత్రంప్రదాస్యామి సుపుత్రోత్పత్తిహేతవే।అయుష్మంతంసుతందేహి కామరాజసుతప్రద। ఇతిదత్వాతు తంయంత్రం బ్రాహ్మణాయమహాత్మనే। దానేనానేనగిరిజే పితృశాపాద్విముచ్యతే॥

తా॥ ఓపార్వతీ యంత్రమును దానముచేయునప్పుడు కుమారుల నిచ్చువాడవైన ఓకామరాజా నేను సంతానముకొరకు కామయంత్రమును దానముచేయుచున్నాను, గనుక నీవుసంతోషించి నాకుదీర్ఘాయుష్మంతుడగు కుమారుని యివ్వవలయును ఇట్లు చెప్పియిచ్చినయడల పితృశాపము విముక్తమగును సంతానముగలుగును.



శ్లో॥ తతస్సుపుత్రాన్సంలబ్ధ్వా పౌత్రనప్తృసమన్వితః। స్థిత్వా భూమౌమహాభోగీ ముదమాప్నోతిపార్వతి॥

తా॥ తరువాత కుమారులు గలిగి, తరువాత మనుమలు గలిగి, మునిమనుమలు గలిగి, అనేక సుఖములతో భూలోకమందు చిరకాలముండును.

శ్లో॥ ఏతత్తేకథితందేవి పితృశాపవిమోచనమ్। గుహ్యాద్గుహ్యతరంలోకే తవస్నేహాన్మయేరితమ్॥ నప్రకాశ్యంత్వయాలోకే రహస్యం దేవతైరపి॥

తా॥ ఓపార్వతీ యిదిపితృశాప విమోచనవిధానము, యిదిమిక్కిలి రహస్యము,నీయందున్న స్నేహమున చెప్పినాను కనుక దీని నెచ్చటను ప్రకాశింప జేయకుము దేవతలకు గూడా రహస్యమయినది

ఇతి సంతానరత్నాకరే షష్ఠపటల స్సమాప్తః.

---

## అథసప్తపటలప్రారంభః.

### గర్భస్రావలక్షణప్రతిపాదకః.

శ్లో॥ అథాతస్సంప్రవక్ష్యామి గర్భస్రావస్యలక్షణమ్। రహస్యం సర్వదేవానాం శృణుష్వగిరిజేనఘే॥

తా॥ ఓ పార్వతీ తరువాత దేవతలకు గూడా తెలియని గర్భస్రావ లక్షణమును చెప్పెదను వినుము.

### గర్భస్రావయోగః.

శ్లో॥ దారేశస్థితరాశీశో రవిణాస్తంగతోయది। కారకోనీచ రాశిస్థో గర్భస్రావోభిజాయతే॥

తా॥ సప్తమాధిపతియున్న రాశినాథుడు సూర్యునితో గూడి అస్తంగతు డయియుండగా పుత్రకారకుడు నీచయందున్న యడల గర్భస్రావముగలుగుచుండును.

శ్లో॥ మేషూరణగతశ్చంద్రో గురుస్సప్తమగోయది। సుతేశో బలహీనశ్చేత్స్రావగర్భోభిజాయతే॥

తా॥ చంద్రుడు దశమమునను, బృహస్పతి సప్తమమునను, యుండగా పుత్రస్థానాధిపతి బలహీనుడైయుండిన యడల గర్భస్రావమగును.

శ్లో॥ మేషలగ్నేసముత్పన్నే పంచమే సౌర్యసంగతే। పంచమే చంద్రమాంద్యోశ్చేత్తదాస్రావోభవిష్యతి॥

తా॥ జన్మలగ్నము మేషమయి పంచమాధిపతి వ్యయమందుండగా పంచమున చంద్రగుళిక గ్రహములుండినయెడల గర్భస్రావమగును.

శ్లో॥ వృషభాత్పంచమే శుక్రే తదీశేషష్ఠరాసిగే। కారకే వ్యోమరాసిస్థే స్త్రీగర్భోజాయతేతదా। పుంగర్భోజాయతేస్రావః క్వచిద్గర్భోభవిష్యతి॥

తా॥ శుక్రుడు వృషభాత్తు పంచమముననను, ఆ పంచమాధిపతి షష్ఠమముననను, యుండగా పుత్రకారకుడు దశమమందున్నయెడల స్త్రీగర్భమునిలచును పురుషగర్భము స్రావమగును, ఒకానొకప్పుడు పురుషగర్భమునిలచును.

శ్లో॥ మిథునాత్పంచమే శుక్రే సంప్రాప్తేస్తంగతేపివా। కారకేణయుతే దృష్టే గర్భస్రావోభవిష్యతి॥

తా॥ శుక్రుడు పాపగ్రహముతో గూడిగాని, అస్తంగతుడయిగాని, మిథునమునకు పంచమమున యుండగా పుత్రకారకుడు శుక్రునితో గూడియున్నను, శుక్రుని చూచుచున్నను గర్భస్రావము గలుగును.

శ్లో॥ కుళీరాత్పంచమేచంద్రే శనిదృష్టేయుతేతథా। కారకే మూఢసంయుక్తే గర్భస్రావోభిజాయతే॥

తా॥ శనితో గూడిగాని, చూడబడిగాని, చంద్రుడు కర్కటమునకు పంచమమందుండగా పుత్రకారకుడు మౌఢ్యమును బొందినయెడల గర్భస్రావము గలుగును.

శ్లో॥ సింహాత్పంచమేమందే మందాత్షష్ఠంగతేగురౌ। తదీశేవ్యయరాశిస్థే జాయతేస్రావదర్శనః॥

తా॥ శని సింహమునకు పంచమముననను, గురువు శనికి షష్ఠమందుండగా అష్టమాధిపతి ద్వాదశమందుండిన యెడల గర్భస్రావమగును.

రక్తస్రావయోగః.

శ్లో॥ కన్యాయాస్సుతగేజీవే జీవాత్పంచమతశ్శశీ। చంద్రాత్పంచమగేభౌమే రక్తస్రావోభవిష్యతి॥

తా॥ బృహస్పతి కన్యకు పంచమమందును, బృహస్పతికి పంచమమున చంద్రుడును చంద్రునకు పంచమమున కుజుడు నుండిరేని రక్తస్రావమగును.

శ్లో॥ జూకాత్కామేధరాసూనౌ మందయుక్తేథవాభృగౌ। రక్తస్రావాచ్ఛిశోర్నష్టం భవిష్యతినసంశయః॥



తా॥ తులాలగ్నమునకు సప్తమమున కుజుడును, శనితోగాని, శుక్రునితోగాని గూడియున్నయెడల రక్తస్రావము వలన శిశునష్టము గలుగును.

శ్లో॥ కీటాత్సుతగతేచంద్రే రాహుణాసహితేక్షితే। కోదండాద్వాతథాచంద్రే గర్భస్రావోభిజాయతే॥

తా॥ చంద్రుడు వృశ్చికమునకుగాని, ధనస్సునకుగాని, పంచమముననుండి రాహువుతో గూడియున్నను లేక రాహువుచేత చూడబడుచున్నను, గర్భస్రావమగును.

శ్లో॥ నక్రాత్కుంభాత్సుతేసౌమ్యే శత్రుయుక్తేక్షితేథవా। కారకేరంధ్రరిఃఫారి సుతేస్రావోభిజాయతే॥

తా॥ బుధుడు మకరమునకుగాని, కుంభమునకు గాని, పంచమమున నుండి శత్రుగ్రహముతో గూడినగాని, చూడబడిగాని యుండగా పుత్రకారకుడు ౬-౮-౧౨ స్థానములందున్నయెడల గర్భస్రావము గలుగును

శ్లో॥ మీనాత్పంచమగేసూర్యే సూర్యాత్పంచమగశ్శశీ। కామేశేబలహీనేచ గర్భస్రావోభిజాయతే॥

తా॥ మీనమునకు పంచమమందు సూర్యుడు, సూర్యునకు పంచమమున చంద్రుడునుండగా సప్తమాధిపతి బలహీనుడుగా నుండెనేని గర్భస్రావమగును.

శ్లో॥ సుతేశేకామరాశిస్థే కామేశేనిధనంగతే। తత్స్రావంతుత్వచాజాతం భవిష్యతినసంశయః॥

తా॥ పంచమాధిపతి సప్తమముననును, సప్తమాధిపతి అష్టమముననున్నయెడల గర్భస్రావము చర్మముతో గూడాగలుగును.

శ్లో॥ పుత్రేశేవ్యయరాశిస్థే వ్యయేశేసుతరాశిగే। కారకేశత్రుసంయుక్తే గర్భస్రావోభిజాయతే॥

తా॥ పంచమాధిపతి ద్వాదశమముననును, ద్వాదశాధిపతి పంచమముననుండగా పుత్రకారకుడు శత్రుగ్రహముతో గూడియున్నయెడల గర్భస్రావమగును.

శ్లో॥ పంచమేనవమేచంద్రే రవిణాసంయుతేక్షితే। కారకేనీచరాశిస్థే గర్భస్రావోభవిష్యతి॥

తా॥ పంచమమున గాని, నవమమునగాని, చంద్రుడుండి రవిచేత చూడబడుచుగాని, రవితో గూడిగాని, వుండగా పుత్రకారకుడు నీచరాశిని బొందియున్న యెడల గర్భస్రావము గలుగును

శ్లో॥ నీచరాశిగతేసూర్యే సుతేశేనయుతేక్షితే: కారకేణయుతేవాపి స్రావోగర్భస్యసంభవేత్॥

తా॥ సూర్యుడు నీచను బొంది పంచమాధిపతితో గూడి గాని, చూడబడి గాని, బృహస్పతితో గూడినగాని, చూడబడినగాని, గర్భస్రావముగలుగును.

గర్భస్రావనిమిత్తపంచదోషాః.

శ్లో॥ గురుశాపసముత్పన్నం గర్భస్రావంతుపంచధా । అన్యస్వహరణాచ్చాపి తథాగర్భవధాచ్చతై॥ మార్జాలహననాత్పాపా ద్గురోర్దూషణకారణాత్ । పంచపాపోద్భవోస్రావో ఋణాదపివిజాయతే॥ ప్రాయశ్చిత్తంశివేశక్త్యా విధ్యుక్తంకురుతేయది । ఆయుష్మంతంసుతం లబ్ధ్వా పుత్రపౌత్రయుతోభవేత్॥

తా॥ గర్భస్రావమునకు కారణములు అయిదువిధములుగానుండును ౧-గురుశాపం ౨-పరద్రవ్యాపహరణము, ౩-గర్భవధ, ౪-పిల్లినిచంపుట, ౫-గురుదూషణము, యిదిగాక జన్మాంతఋణమువలనను, గర్భస్రావము గలుగును, కాబట్టి దీనికి ప్రాయశ్చిత్తమును విధ్యుక్తముగా యథాశక్తిగా చేసినయడల యీదోషమునశించిదీర్ఘాయుష్మంతుడగు కుమారుడుగలుగును తరువాత పౌత్రులుగలుగుదురు.

గర్భస్రావనివారక ప్రాయశ్చిత్తవిధిః.

శ్లో॥ ఇతిశ్రుత్వాశుభంవాక్యం శంకరస్యముఖాచ్యుతమ్। పునః ప్రోవాచగిరిజా బ్రూహీతిపరిహారకమ్॥

తా॥ యిట్లు శంకరుడు చెప్పగావిని పార్వతి ఓశంకరా యీపాపములు నశించు యుపాయమును చెప్పుమనికోరెను.

ధాత్రీమంత్రానుష్ఠానక్రమః.

శ్లో॥ పార్వత్యావచనంశ్రుత్వా ప్రాయశ్చిత్తవిధింపునః । ప్రోవాచశంకరస్తత్ర ధాత్రీయంత్రవిధింశుభమ్॥ ధాత్రీమంత్రస్వరూపంచ సాంగోపాంగంషడంగకమ్॥

తా॥ ఆ మాట విని శివుడు గర్భస్రావ దోషనివారణకై ధాత్రీయంత్రమును, ధాత్రీమంత్రమును సాంగోపాంగముగాపూజించు విధానము చెప్పెను.

శ్లో॥ ఈశానిధాత్రీమంత్రస్యఋషిఃబ్రహ్మాప్రకీర్త్యతే।గాయత్రీ ఛందఇత్యుక్త్వా గర్భస్రావనివారణే ॥ వినియోగోథహాంబీజం శంశక్తి బ్రహ్మకీలకమ్। హాంమిత్యాదికరన్యాస మంగన్యాసంతథైవచ॥



తా॥ ఓ పార్వతీ వినుము ధాత్రీమంత్రమునకు బ్రహ్మఋషి, గాయత్రీఛందస్సు గర్భస్రావ నివారణము వినియోగము, హాంబీజము, శంశక్తి, బ్రహ్మకీలకము, హాం, హీం, హూం, హైం, హౌం, హః, అని అంగన్యాసము కరన్యాసము.

శ్లో॥ సర్వసృష్టికరబ్రహ్మ న్యన్మయాసప్తజన్మసు! నివార్యార్జితపాపంమే జీవపుత్రంచదాపయ । ఇతిధ్యాత్వాముహూర్తంతు పంచపూజాంతథైవచ । కృత్వాథమూలమంత్రంతు జపేద్ధాత్రావదాతునః॥

తా॥ సమస్తలోకములను సృజించు యోబ్రహ్మదేవుడా నేను పూర్వమునేడు జన్మములందు చేసినపాపమునునశింపజేసి సుదీర్ఘాయుష్మంతుడగు కుమారునియిమ్మ యిట్లు రెండుగడియలకాలము ధ్యానించి తరువాత పంచపూజలనుచేసి,ధాత్రావదాతునః, అనుమూలమంత్రమును జపించవలయును.

శ్లో॥ చతుర్ణామపిమంత్రాణాం నైజమేషసమన్వితమ్। కాకవంధ్యానివృత్యర్థం జపేదష్టసహస్రకమ్॥

తా॥ కాకవంధ్యా దోషనివృత్తికొఱకు "యీధాత్రావదాతునః", అనునాలుగు మంత్రములను నైజమేష మంత్రముతోగూడా కలిపి యెనిమిదివేలు జపించవలయును, కాకవంధ్యయనగా వకసారి గర్భముదాల్చి పుత్రునిప్రసవించి తిరిగిగర్భముతేకుండుట ధాత్రావదాతుః, అనునాలుగు మంత్రములు ముందువ్రాయబడుచున్నవి.

శ్లో॥ స్రావగర్భనివృత్యర్థం జపేద్వింశత్సహస్రకమ్। దశాంశం తర్పణంచైవ తద్దశాంశంహుతేద్బుధః ॥ బ్రాహ్మణాన్భోజయేత్పశ్చాత్తద్దశాంశంయథావిధి॥

తా॥ పైజెప్పినమంత్రములనే గర్భస్రావదోష నివృత్తికై యిరువదివేలుజపించవలయును జపదశాంశము తర్పణము, తర్పణ దశాంశము హోమము, హోమ దశాంశము, బ్రాహ్మణభోజనమును చేయవలెను.

శ్లో॥ యంత్రక్రమంప్రవక్ష్యామి గర్భస్రావనివారకమ్ । సౌవర్ణేరజతేస్తామ్రే ర్యంత్రంకృత్వాతుభక్తితః॥

తా॥ తరువాత యంత్రక్రమముచు చెప్పెదనువినుము బంగారముతోగాని, వెండితో గాని, యంత్రమునుచేయించవలయును.

శ్లో॥ వృత్తాకారంత్రికోణంస్యా త్కోణాగ్రేత్యక్షరంలిఖేత్ । తద్బాహ్యేసాధ్యనామానితస్యోపర్యష్టకోణకమ్॥ అష్టకోణేషుతన్మంత్రం నైజమేషాదికంవచః।లిఖిత్వాయంత్రబాహ్యేతు భూపురేణసమన్వితం॥

తా॥ మందుగా వృత్తమును వ్రాసి దానిమీద త్రికోణమును వ్రాయవలెను త్రికోణాగ్రములందు మూడు అక్షరములను వ్రాయవలయును, దానికిబయట సాధ్యనామము వ్రాయవలయును, దానికిమీద అష్టకోణము వ్రాయవలయును, అష్టకోణములందు నైజమేవమంత్రమును, ధాతృమంత్రమును, వ్రాయవలయును, యంత్రముకు చివరభూపురమును లిఖించవలయును.

శ్లో॥ యంత్రే బ్రహ్మాణమావాహ్య పూజయేత్షోడశైః క్రమాత్। యంత్రం స్పృష్ట్వా జపేన్మంత్రి మితిధాతాదదాతునః ॥ ఋగ్భిశ్చతుర్భిస్సహిత ధాతృమంత్రం తు వాగ్యతః। దినేదినే పృథక్పూజాం కృత్వా మంత్రం తథా జపేత్॥

తా॥ యంత్రమందు బ్రహ్మను ఆవాహనచేసి ౧౬ పూజలుచేయవలెను, హస్తముతో యంత్రముకు తాకి నాలుగు ఋక్కులతో గూడిన ధాతృమంత్రమును మౌనముతో జపించవలయును ప్రతిదినమందును వేరువేరుగా పూజించి అట్లుగానే జపించవలెను.

శ్లో॥ ఏవం మండలమభ్యర్చ్య యంత్రం విప్రాయదాపయేత్। గురుశాపాత్సముత్పన్నం గర్భస్రావం నివార్య మే॥ జీవపుత్రం ప్రదేహ్యాశు యంత్రదానాత్ప్రసాదమహ । కృతం పాపమసహ్యం మే యన్మయా పూర్వజన్మని॥ నివార్యతే న్మహత్పాపం జీవపుత్రంచ దేహి మే। ఇత్యుక్త్వా యంత్రమాదాయ బ్రాహ్మణాయ కుటుంబినే। శ్రోత్రియాయ ప్రదాతవ్యం గర్భస్రావనివృత్తయే॥

తా॥ ఓ పార్వతీ యీప్రకారముగా నలుబది రోజులు పూజించి ఓ బ్రహ్మదేవుడా నేను పూర్వజన్మమందుచేసిన గురుశాపాదిపాపములను నశింపజేసియీగర్భస్రావమును నివారించి గర్భమునునిలిపి చిరంజీవియగు కుమారునినాకిమ్ము అనిప్రార్థించి యంత్రమును, కుటుంబవంతుడును, శ్రోత్రియుడువగు బ్రాహ్మణున కివ్వవలయును అట్లు చేసిన యెడల గర్భస్రావదోషము నశించును.

శ్లో॥ ఏవంకృతంతు గిరిజే ఆయుష్మంతం సుతంలభేత్ । పుత్రపౌత్రాదిసస్తారం లభతే నాత్రసంశయః॥

తా॥ యిట్లుచేసినయెడల దీర్ఘాయుష్మంతుడగు పుత్రునిబొంది మనుములు, మునిమనుమలు, గలిగిసుఖించును యిందుకు సందేహములేదు.

శ్లో॥ ఇదంరహస్యం పరమం ప్రీత్యా తవమయేరితమ్ । యస్యకస్యాపి దేవేశి నవక్తవ్యం త్వయానఘే॥



తా॥ ఓ పార్వతీ యిదిచాలా రహస్యము నీయందుగల ప్రేమచేత చెప్పినాను గాని యితరులకు చెప్పను, నీవునుయితరులకు చెప్పకుము.

మంత్రానుష్ఠానక్రమః.

అస్యశ్రీ ధాతృమహామంత్రస్య- బ్రహ్మఋషిః- గాయత్రీఛందః- కమలాసనో దేవతా- హాంబీజం- శంశక్తిః- బ్రహ్మకీలకం- గర్భస్రావప్రతిబంధక నివృత్త్యర్థేజపే వినియోగః- హ్రాం- అంగుష్ఠాభ్యాంనమః- హ్రీం- తర్జనీభ్యాంనమః- హ్రూం- మధ్యమాభ్యాంనమః- హ్రైం- అనామికాభ్యాంనమః- హ్రౌం- కనిష్ఠికాభ్యాంనమః- హ్రః కరతలకరపృష్ఠాభ్యాంనమః- ఏవంహృదయాదిన్యాసః- లోకత్రయేణదిగ్బంధః॥ ధ్యానం॥ సర్వసృష్టికరబ్రహ్మ న్యన్మయాస్తుజన్మను । నివార్యార్జితపాపం మే జీవపుత్రంప్రదాపయ॥ లమిత్యాది పంచపూజాంకుర్యాత్॥ మూలమంత్రః॥ ధాతాదదాతునోరయిం ప్రాచీం జగతస్పతిః॥ సనఃపూర్ణేనవావనత్॥ ధాతాప్రజాయాఉతరాయ ఈశేధాతేదంవిశ్వం భువనంజజాన। ధాతాపుత్రంయజమానాయ దాతాతస్మాఉహవ్యం ఘృతవద్విధేమ॥ ధాతాదదాతునోరయిం ప్రాచీంజీవాతుమక్షితాం । వయందేవస్య … హిసుమతిగ్ం సత్యరాధసః ॥ ధాతాదదాతుదాశుషే వసూనిప్రజాకామాయ మీఢుషేదురోణే ॥ తస్మైదేవా అమృతా స్సంవ్యయంతాం విశ్వేదేవాసోఅదితిస్సజోషాః॥ ఇతిజప్త్వాఉత్తరన్యాసాదికం కుర్యాత్॥ ఏవంవింశత్సహస్రజపః ॥ తద్దశాంశతర్పణం ॥ తద్దశాంశహోమః ॥ తద్దశాంశ బ్రాహ్మణభోజనం॥ మండలాంతేయంత్రదానమ్॥

కొందఱు సంతానగోపాలం పునశ్చరణచేయుదురు అందువలన కూడా దోషపరిహారమై సంతానముతప్పకకలుగును, ఓం, హ్రాం, హ్రీం, క్లీం, సంతానగోపాల కృష్ణాయస్వాహా అని ౧౦౮ మాఱులుసూర్యగ్రహణజాలంబున గురుముఖతఃఉపదేశమును బొంది మంత్రవిధిగాజపించవలెను కొన్నిరహస్యములు యిచ్చుటవ్రాయబడదు.

ఇతి సంతానరత్నాకరే సప్తపటల స్సమాప్తః.

---

అథ అష్టపటల ప్రారంభః.

దేవశాపలక్షణ ప్రతిపాదకః.

శ్లో॥ అథాతస్సంప్రవక్ష్యామి దేవశాపస్యలక్షణమ్ । శృణుష్వ పార్వతిత్వంహి పుత్రవృద్ధికరంపరమ్॥

తా॥ ఓ పార్వతీ తరువాత దేవశాపలక్షణమును చెప్పెదనువినుము వినిన యెడల పుత్రవృద్ధి గలుగును.

శ్లో॥ సుతాధిపేశుభస్థానే శుభదృష్టివివర్జితే। పాపగ్రహేణ సందృష్టే దేవశాపాత్సుతక్షయః॥

తా॥ పుత్రస్థానాధిపతి శుభరాశియందుండి శుభగ్రహముచేత చూడబడక పాపగ్రహముచేత చూడబడినయెడల దేవశాపమువలన పుత్రనాశనమగును,

దేవశాపాత్పుత్ర నాశయోగః.

శ్లో॥ సుతస్థానేశుభైర్యుక్తే మందయుక్తేథవీక్షితే। శత్రుదృష్టియుతేవాపి దేవశాపాత్సుతక్షయః॥

తా॥ పుత్రస్థానము శుభగ్రహములతో గూడియుండిన శనితోగాని శత్రుగ్రహముతోగాని గూడియుండినను లేక చూడబడి యున్నను దేవశాపమువలన పుత్ర నాశనమగలుగును.

శ్లో॥ పుత్రస్థేపుత్రపేయత్ర భౌమయుక్తేథవీక్షితే। కారకే శుక్రసంయుక్తే దేవశాపాత్సుతక్షయః॥

తా॥ పుత్రస్థానాధిపతి పుత్రస్థానమందుండి అంగారకునితో గూడిగాని చూడబడిగాని యుండగా పుత్ర కారకుడు శుక్రునితో గలిసి యున్నయెడల దేవశాపము వలన పుత్రనాశన మగును.

శ్లో॥ శుక్రేబలహీనేచ సుతేశేవ్యయగేశశీ। దేవశాపమితిప్రోక్తం రవిదృష్టియుతేథవా॥

తా॥ పుత్రస్థానాధిపతి ద్వాదశమందుండగా శుక్రుడు బలములేనివాడై యుండి చంద్రుడు సూర్యునితో గూడి గాని చూడబడి గాని యున్నయెడల దేవశాపము వలన పుత్రనాశనమగును.

శ్లో॥ సుతస్థానాధిపేసౌమ్యే భౌమక్షేత్రంగతేయది। కారకేఽస్తంగతేజీవే దేవశాపాత్సుతక్షయః॥

తా॥ బుధుడు పంచమాధిపతియై కుజస్థానమందుండగా పుత్రకారకుడగుబృహస్పతి అస్తంగతుడై యున్నయెడల దేవశాపమువలన పుత్రనాశనమగును.

శ్లో॥ పుత్రస్థానాధిపేమందే రవిణాస్తంగతేయది। జీవేబలహీనేచ దేవశాపాత్సుతక్షయః॥



తా॥ శని పుత్రస్థానాధిపతియై రవితో గూడి అస్తంగతుడైయుండగా బృహస్పతికి బలములేనంతలో పుత్రనాశనమగును.

శ్లో॥ సుతేశేనీచసంయుక్తే సుతేనీచస్థితోయది। జీవదృష్టివిహీనేచ దేవశాపాత్సుతక్షయః॥

తా॥ పంచమాధిపతి నీచగ్రహముతో గూడియుండి పంచమమున నీచగ్రహముండి బృహస్పతి దృష్టిలేకున్నయెడల దేవశాపమువలన పుత్రనాశనమగును.

శ్లో॥ సుతస్థానాధిపేజీవే శనిరాహుయుతేక్షితే। శత్రుక్షేత్రగతేవాపి దేవశాపాత్సుతక్షయః॥

తా॥ పంచమాధిపతి గురువై శని రాహువులతో గూడినను, చూడబడినను, లేక గురువు శత్రుక్షేత్రమందున్నను దేవశాపమువలన పుత్రనష్టమగును.

శ్లో॥ జాతంజాతంవినాశస్స్యాన్నదీర్ఘాయుశ్చసూనవః। తద్దోషపరిహారం తే వక్ష్యామిశృణుపార్వతి॥

తా॥ ఓపార్వతీ పూర్వోక్తక్రమమున గ్రహములుండెనేని సంతానము గలుగుచుండియు నశించును గాన ఆదేవశాప పరిహారమును చెప్పెదనువినుము.

దేవశాపనివారక శివపూజాక్రమః.

శ్లో॥ జలస్థంసికతంహృత్వా పార్థివంలింగముత్తమం। గణేశసహితంకృత్వా పూజయిత్వాయథావిధి॥

తా॥ జలమందుండు యిసుకను తీసికొనివచ్చి విఘ్నేశ్వరుని శివలింగమును జేసి యథావిధినా పూజించవలెను.

శ్లో॥ ధ్యానాదిపూజాం నియమేనకృత్వా సమ్యక్సుపూతేన జలేనబిల్వైః। సంప్రార్థ్య దేవేశమనన్యభక్త్యా త్వబ్దత్రయంచాక్షరపంచకైస్తు। సద్యోజాతాదిమంత్రైశ్చ పూజయేద్వవహంశివం। పార్థివం కురుతేయస్తు సపుత్రంలభతేధ్రువమ్॥

తా॥ సద్యోజాతాది మంత్రములచేతను, శివపంచాక్షరీమంత్రముచేతను, పరిశుద్ధ జలములతో అభిషేకముచేసి మారేడు దళములతో ధ్యానాది షోడశోపచార పూజలు చేయుచు నిశ్చలమయిన భక్తితో స్తుతించవలయును, యిట్లు మూడు సంవత్సరములు పూజించిన యెడల పుత్రలాభముకలుగును నిశ్చయము.

శ్లో॥ త్రివర్షపూజనాచ్ఛంభో రాయుష్మంతంసుతంలభేత్। దేవశాపాద్విముచ్యేత శంకరారాధనాద్భువి॥

తా॥ మూడు సంవత్సరములు శివుని పూజించిన యడల దేవశాపము నశించును దీర్ఘాయుష్మంతుడగు పుత్రుడు కలుగును.

శ్లో॥ త్రివర్షాంతే తిథిక్త్వాతు లింగదానం కరోతి చేత్ । సద్యో ముచ్యేత పాపాత్తు జన్మాంతరకృతాద్బహోః॥

తా॥ మూడు సంవత్సరములు గడచిన తరువాత లింగదానమును చేయవలయును, అట్లు చేసినయడల జన్మాంతరమందు చేసినగొప్పపాపమంతయు అప్పుడె నశించును.

దేవశాపనివారక లింగదానక్రియ.

శ్లో॥ లింగదానంవినాపూజా వ్యర్థాభవతిపార్వతీ। శివలింగం ప్రదాస్యామి పుత్రాయుష్యవివృద్ధయే॥ దానేనానేనశంభోత్వం పుత్రస్యాయుష్మ దేహి మే । ఇతిదత్వాశివంలింగం పంచాక్షరపురస్సరమ్ । బ్రాహ్మణాన్భోజయేత్పశ్చా దాయుష్మంతంసుతంలభేత్॥

తా॥ ఓ పార్వతీ వినుము లింగదానము చేయని యడల పూజ యంతయు నిష్ఫలమగును గనుక తప్పక లింగదానము చేయవలయును ఆలింగదానమందు ఓశంకరా నాకు దీర్ఘాయుష్మంతుడగు కుమారుడు గలుగుకొఱకు లింగదానమును చేయుచున్నాను గాన యీలింగదానమున నీవుసంతోషించి నాకుమారునకు చిరాయువును యిమ్మ, ఇట్లని ప్రార్థించి పంచాక్షరీ మంత్రమును పఠించుచు లింగదానము చేయవలెను, తరువాత బ్రాహ్మణ సమారాధన చేయవలెను, యిట్లు చేసినయడల చిరాయువుగలకుమారుడు గలిగి సుఖముగానుండును.

ఇతి సంతానరత్నాకరే అష్టమపటల స్సమాప్తః.

---

అథ నవమ పటల ప్రారంభః.

శత్రుదోషలక్షణ ప్రతిపాదకః.

శత్రుశాపాత్పుత్రనాశ యోగః.

శ్లో॥ అథాతస్సంప్రవక్ష్యామి రిపుదోషాత్సుతక్షయమ్।సుతేశే భౌమసంయుక్తే రిపునాథయుతేక్షితే॥ శుభైరవీక్షితేవిండ్యా ద్రిపుదోషాత్సుతక్షయః॥

తా॥ తరువాతశత్రుశాపమువలన పుత్రనాశనమును తెలుసుకొనువిధముచెప్పెదను వినుము పుత్రకారకుడు అంగారకునితో గూడియుండి షష్ఠాధిపతితో గూడియున్నను లేక



చూడబడి యున్నను, శుభగ్రహముల చేత చూడబడక యున్నయడల శత్రుశాపమువలన సంతాన నష్టమగునని తెలుసుకొనవలెను.

శ్లో॥ పంచమేభౌమసంయుక్తే త్వరినాథయుతేథవా । శుభైరవీక్షితేవిండ్యా ద్రిపుదోషాత్సుతక్షయః॥

తా॥ పుత్రస్థానము కుజునితో గాని,షష్ఠాధిపతితో గాని,గూడియుండి శుభగ్రహములచేత చూడబడకయున్నయడల శత్రుశాపమున సుతనాశనమగును.

శ్లో॥ జీవేజాయాస్థితేవాపి శత్రుయుక్తేథవీక్షితే। పాపగ్రహేణసందృష్టే శత్రుశాపాత్సుతక్షయః॥

తా॥ బృహస్పతి సప్తమమందుండిగాని, శత్రుగ్రహముతో గూడిగాని, చూడబడిగాని,యుండిపాపగ్రహముచేతచూడబడుచున్నయడల శత్రుశాపమునసుతక్షయమగును.

శ్లో॥ శత్రుస్థానంగతేజీవే సుతేశేనిధనంగతే। చంద్రేపాపసమాయుక్తే శత్రుశాపాత్సుతక్షయః॥

తా॥ బృహస్పతి శత్రుస్థానమందును, పంచమాధిపతి అష్టమమందును,యుండగా చంద్రుడు పాపగ్రహముతో గూడినయడల శత్రుశాపమున సుతక్షయమగును.

శ్లో॥ సుతేశేనిధనేభౌమే చంద్రాత్పాపసమన్వితే। కారకేరిఃఫరాశిస్థే శత్రుశాపంవదంతిదమ్॥

తా॥ పుత్రాధిపతి అష్టమమందును, కుజుడుచంద్రునకు ద్వాదశమందును, పుత్రకారకుడు ద్వాదశమందును, వున్నయడల శత్రుశాపమున సుతక్షయమగును.

శ్లో॥ సుతేశేవ్యయగేసౌమ్యే శుక్రేవాసూర్యసంయుతే। పాపగ్రహేణసందృష్టే శత్రుశాపాత్సుతక్షయః॥

తా॥ పంచమాధిపతి ద్వాదశమందును, బుధుడుగాని,శుక్రుడుగాని, రవితోచేరి పాపగ్రహముచేత చూడబడియున్నయడల శత్రుశాపమున సుతక్షయమగును.

శ్లో॥ మందేశుభేవ్యయేరాహౌ జీవయుక్తేథవాశశీ।పంచమాధిపతౌరంధ్రే కామేశేరిపురాశిగే॥ శత్రుస్థానాధిపేకేంద్రే కర్మేశేలగ్నవిత్తగే। విత్తేశేకర్మరాశిస్థే రిపుదోషాత్సుతక్షయః॥

తా॥ శని శుభరాశి యందును, రాహువు ద్వాదశ మందును, చంద్రుడు గురువుతోడను, పంచమాధిపతి అష్టమమందును, సప్తమాధిపతి షష్ఠ స్థానమందును, షష్ఠాధిపతి ౧-౪-౭-౧౦- స్థానములందును, దశమాధిపతి ద్వితీయమునను, ద్వితీయాధిపతి దశమమందును, వున్నయడల శత్రుశాపమున సుతక్షయము గలుగును.

శ్లో॥ కామేయోన్నినిశానాథే చంద్రాత్కర్మగతే గురౌ। సుతేశేబలహీనేచ పుదోషాత్సుతక్షయః॥

తా॥ చంద్రుడు సప్తమమునగాని, దశమమునగాని యుండి గురువు చంద్రునకు దశమమందుండి పుత్రస్థానాధిపతి బలములేనివాడయి యుండినయెడల శత్రుశాపమువలన పుత్రనాశనమగునని తెలిసికొనవలెను.

శ్లో॥ జీవేర్కేణసమాయుక్తే చంద్రే పాపనిరీక్షితే। శత్రుస్థానాధిపేక్లీబే శత్రుశాపాత్సుతక్షయః॥

తా॥ బృహస్పతి సూర్యునితోగూడియుండి చంద్రుడు పాపగ్రహముచేతచూడబడుచుండగా శత్రుస్థానాధిపతి నపుంస గ్రహమైన యెడల శత్రు శాపము వలన పుత్రనాశనమగును.

శత్రునాశనివారక దుర్గాపూజాక్రమః.

శ్లో॥ తద్దోషపరిహారార్థం దుర్గాదేవీంప్రపూజయేత్। తస్యాదేవ్యాః ప్రసాదేన ఆయుష్మంతంసుతంలభేత్॥

తా॥ ఆశత్రుశాపదోష పరిహారముకొఱకు దుర్గాదేవిని పూజించవలెను దుర్గాదేవిప్రసాదమువలన పుత్రునకాయుష్యము వృద్ధినొందును.

శ్లో॥ తచ్ఛ్రుత్వాశివవాక్యంసా పునఃపప్రచ్ఛశంకరమ్। పూజావిధించమేబ్రూహి దుర్గాదేవ్యాయథావిధి॥

తా॥ అట్లు శివుడు చెప్పగా పార్వతివిని ఓశంకరా! దుర్గాపూజా విధానమును నాకు యథావిధిగా చెప్పుమనియడిగెను.

శ్లో॥ శంకరస్తువచశ్శ్రుత్వా దేవ్యాఉక్తంతతోబ్రవీత్। ఆదిశక్తింపరాందుర్గాం పుత్రార్థంపూజయేదితి॥ అచిరాల్లభతేపుత్రం ఆయుష్మంతంతతోనఘే॥

తా॥ శివుడు పార్వతి మాటవిని ఓ పార్వతీ ఆదిశక్తియైన దుర్గాదేవినిపూజించినయెడల శీఘ్రకాలములోనే దీర్ఘాయుష్మంతుడగు కుమారుడు గలుగును.

దుర్గామంత్రానుష్ఠానక్రమః.

శ్లో॥ దుర్గాసూక్తేనమంత్రేణ ధ్యానాదిచయథాక్రమమ్। షోడశైరుపచారైశ్చ ప్రతిసూక్తంపునఃపునః॥ పూజాంతేమూలమంత్రంచ జపేత్పుత్రార్థమేవచ॥



తా॥ దుర్గాసూక్త మంత్రములందు ప్రతిసూక్తము చేతను ధ్యానావాహనాది షోడశోపచారములను జేయవలెను అనఁగా వకొక్కక సూక్తముచేత ఒకొక్కక పూజను చేయవలయుననుట, పూజానంతరము మూల మంత్రమును జపించవలెను, సంకల్ప మందు పుత్రప్రాప్త్యర్థము అనిచెప్పుకోవలెను. అనఁగా పుత్రప్రాప్త్యర్థమని.

శ్లో॥ మంత్రస్యాస్యమహాభాగే హయగ్రీవో ఋషి స్తథా। అనుష్టుప్ఛందఇత్యుక్త్వా శ్రీదుర్గాదేవదేవతాచ॥ బీజఃక్లామితిక్లీంశక్తిః క్లూంచకీలకమిత్యపి। వినియోగోథపుత్రార్థం దీర్ఘాయుష్యాభివృద్ధయే। క్లామిత్యాదికరన్యాస మంగన్యాసంతథైవచ॥

తా॥ ఈ దుర్గామంత్రమునకు హయగ్రీవుడు ఋషి, అనుష్టుప్ఛందము, శ్రీదుర్గాదేవి దేవత, క్లాం అనిబీజము, క్లీం శక్తి, క్లూం అనికీలము పుత్రులుగలిగి దీర్ఘాయుష్మంతులుగానుండుట వినియోగము, క్లాం, క్లీం, క్లూం, క్లైం, క్లౌ, క్లః, అనిషడంగన్యాస కరన్యాసములను చేయవలెను.

శ్లో॥ మాత స్త్రిమూర్తీనాం పదమాపరమేశ్వరీ। మహిషధ్వంసినీదుర్గే మమపాపంవ్యపోహయ॥ శత్రుశాపంనివార్యత్వం జన్మాంతరకృతంహ్యఘం। దీర్ఘాయుర్మమపుత్రస్య దేహిదుర్గేప్రసీదమే॥

తా॥ త్రిమూర్తులకు మూలమును ఈశ్వరివి అయినటు వంటిన్ని మహిషాసురుని చంపినటువంటి ఓ దుర్గాదేవీ తల్లీ నేను బహుజన్మములందు చేసినపాతకములను నశింపజేసి శత్రుశాపమును నివారించి నాకుమారునకు దీర్ఘాయుష్యమును యిమ్ము నాయందనుగ్రహముంచుము.

శ్లో॥ ఇతిధ్యాత్వామూలమంత్రం జపేత్సంఖ్యాపురస్సరమ్। గాయత్రీసహితంమంత్రం దుర్గాదేవ్యాస్తుయత్నతః॥ జపేత్షోడశసాహస్రం తర్పణంహోమమేవచ। భోజనంబ్రాహ్మణానాంచ దశాంశక్రమతోయజేత్॥

తా॥ యిట్లు ప్రార్థించుచు జపమాలికతో లెక్కించుచు దుర్గామూల మంత్రమును జపించవలెను యీజపమందు దుర్గాగాయత్రిని గూడా చేర్చవలెను, యిట్లు పదహారువేలు జపముచేసి తద్దశాంశము తర్పణము తద్దశాంశము హోమము తద్దశాంశము బ్రాహ్మణభోజనమును జరుపవలయును.

దుర్గాయంత్రదానం.

శ్లో॥ దుర్గాయంత్రంబ్రాహ్మణాయ దద్యాచ్ఛేదనఘేప్రియే।

దీర్ఘాయుష్మంసుతంలబ్ధ్వా మోదతేభువిమానవః॥

తా॥ తరువాత దుర్గాయంత్రమును బ్రాహ్మణునకు దానముచేయవలెను యిట్లు చేసినయెడల దీర్ఘాయుష్మంతుఁడగు కుమారుడు గలిగి భూలోకసుఖమొందునుదుర్గా మూలమంత్రము ఓం, శ్రీం, హ్రీం, క్లీం, దుర్గాదేవ్యైనమస్స్వాహా దుర్గాయత్రీ కాత్యాయనాయవిద్మహే కన్యకుమారిధీమహి తన్నోదుర్గిః ప్రచోదయాత్॥ యంత్రమునుగురుముఖముగా తెలుసికొనవలయును.

ఇతి సంతానరత్నాకరే నవమపటలస్సమాప్తః.

---

## అథ దశమపటలప్రారంభః.

### విష్ణుశాపలక్షణప్రతిపాదకః.

శ్లో॥ అథాతస్సంప్రవక్ష్యామి విష్ణుదోషాత్సుతక్షయమ్। శ్రుణు నాన్యమనాదేవి దోషాన్ జాతకసంభవాన్॥ జన్మకాలేగ్రహాణాంచ పుత్రక్షయకరంఫలమ్॥

తా॥ ఓపార్వతీ జన్మకాలమందుండు గ్రహములనుబట్టి విష్ణుశాప దోషముగలిగి యున్నట్లు తెలుసుకొనువిధమును చెప్పెదను మంచిమనస్సుగలదానవై వినుము యీవిష్ణుశాపమును పుత్రనాశనకరమగును.

శ్లో॥ లగ్నాత్పంచమగేసోమే చంద్రాత్పంచమగేబుధే। నవమాద్స్థితేవాపి విష్ణుశాపాత్సుతక్షయః॥

తా॥ జన్మలగ్నమునకు పంచమమున చంద్రుఁడును, చంద్రునకుపంచమమున బుధుడును, వున్నయెడల విష్ణుశాపమువలన పుత్రనష్టముగలుగునని తెలుసుకొనవలెను.

శ్లో॥ కృతంపూర్వభవేద్విష్ణో రాలయస్యవిఘట్టనమ్। తత్పాపాత్పంచమేసౌమ్యే స్థితేచంద్రాత్తథైవహి। విష్ణుశాపమితిప్రోక్తం సుతక్షయకరంనృణామ్॥

తా॥ పూర్వజన్మమున విష్ణువుయొక్క ఆలయమును ధ్వంసముజేసిన యెడల అట్టివాని జాతకమందు లగ్నమునకుపంచమమందుచంద్రుడును చంద్రునకుపంచమమునబుధుఁడును యిట్లున్నవానికివిష్ణు శాపమువున్నట్లు తెలుసికొనవలెను.

శ్లో॥ నవమేశశిజేక్రూరయుక్తేపాపనిరీక్షితే। కారకేబలహీనేచ విష్ణుశాపాత్సుతక్షయః॥



తా॥ బుధుఁడుపాప గ్రహముతోగూడి గాని, పాపగ్రహముచేత చూడబడిగాని నవమమున నుండగా పుత్రకారకుడు బలహీనుడైయుండెనేని విష్ణుశాపమువలన సంతాననష్టముగలుగును.

శ్లో॥ పంచదావిష్ణుశాపంచ కులధ్వంసకరంపరమ్। బ్రహ్మస్వహరణంచైవ తథామఖవిఘాతనమ్॥ విష్ణుస్వాహరణంచైవ తిలదానప్రతిగ్రహమ్। ఏతేపంచమహాదోషా స్సుతక్షయకరాఃప్రియే॥

తా॥ విష్ణుశాపము అయిదు విధములు ౧ విష్ణు ఆలయమును నశింపచేయుట, ౨ బ్రాహ్మణ ద్రవ్యము హరించుట, 3 యజ్ఞమును పాడుచేయుట, ౪ విష్ణువు ద్రవ్యము హరించుట, ౫ తిలదానమును గ్రహించుట, విష్ణుబ్రాహ్మణరూపేణ- యజ్ఞోవైవిష్ణుః తిలాఃకృష్ణసముద్భవాః, ఇత్యాది ప్రమాణములవలన బ్రాహ్మణయజ్ఞతిలలును విష్ణుస్వరూపములేగనుక విష్ణుశాపగణములలో చేరినవి అనఁగా యీ అయిదు విధముల దోషములను జేసినవానికి విష్ణుశాపముగలుగును ఆశాపమువలన వంశమునశించును.

శ్లో॥ లగ్నాత్పంచమగేమందే బుధయుక్తేవ్యయేగురౌ। కామేశేరిపుగేభౌమే విష్ణుశాపాత్సుతక్షయః॥

తా॥ శని బుధునితోగూడి పంచమమునను, బృహస్పతి ద్వాదశమునను, అంగారకుడు సప్తమాధిపతియై షష్ఠస్థానమందును వున్నయెడల విష్ణుశాపము వలన పుత్రనాశనము గలుగును.

శ్లో॥ లగ్నాత్సుఖగతేవాపి సౌమ్యేవ్యోమ్నిగురౌశుభే। మాహేయసహితేవాపి విష్ణుశాపాత్సుతక్షయః॥

తా॥ బుధుఁడు చతుర్థమునను, బృహస్పతి దశమమునను, అంగారకుడు యేకాదశమున నున్నయెడల విష్ణుశాపమువలన పుత్రనష్టము గలుగును.

శ్లో॥ పుత్రస్థేతుసుతాధీశే తద్ధీశేరిఃఫరంధ్రగే। కారకేపాపమధ్యస్థే విష్ణుశాపాత్సుతక్షయః॥

తా॥ పుత్రస్థానాధిపతి తృతీయమునను, ఆతృతీయాధిపతి ద్వాదశాష్టమమున నుండగా పుత్రకారకుడు పాపగ్రహ మధ్యనున్న యెడల విష్ణుశాపమువలన పుత్రక్షయము గలుగును.

శ్లో॥ సుతేశేకామరాశిస్థే కామేశేకామరాశిగే। చంద్రాద్వాసంస్థితేయస్య తస్యవిష్ణుకృతంఫలమ్॥

తా॥ పుత్రస్థానాధిపతి సప్తమమునను, సప్తమాధిపతి సప్తమమునను, లేక చంద్రునకు సప్తమమునను, వున్నయెడల విష్ణుశాపమువలన సంతాన నష్టమగును.

శ్లో॥ రోగస్థానంగతే కూరే పుత్రేశేనయుతేక్షితే। జాయాయాః ఋతుకాలేచ కుక్షిరోగో భవేత్తదా॥

తా॥ పాపగ్రహము పంచమాధిపతితో గూడిగాని, చూడబడిగాని, అష్టమమున నున్నయెడల జాతకుని భార్యకు ఋతుకాలమందు కడుపుశూల గలుగును.

శ్లో॥ జాయాస్థానంగతే భౌమే గురుయుక్తే థవాభృగౌ। చంద్రేతు పాపాన్వితే నే క్వచిత్స్రావో భవిష్యతి॥

తా॥ కుజుఁడుగాని, శుక్రుఁడుగాని, గురువుతో గలసి సప్తమమున నుండగా చంద్రుఁడు ద్వాదశమునకు అష్టమమునను ఉండిన యెడల యొకానొకగర్భము స్రవించును అనఁగా గర్భస్రావము గలుగుననుట.

శ్లో॥ పుత్రస్థానాధిపే సూర్యే కామే వ్యాప్తిన్వ్యయంగతే। కారకే బలహీనేచ విష్ణుశాపాత్సుతక్షయః॥

తా॥ సూర్యుఁడు పంచమాధిపతియై ౬-౧౦-౧౨ స్థానములందుండగా పుత్రకారకుడు బలహీనుడై యుండెనేని విష్ణు శాపమువలన పుత్రనష్టము గలుగునని తెలుసుకొనవలయును.

శ్లో॥ పుత్రస్థానాధిపే చంద్రే వ్యయే శేనయుతేక్షితే। కారకే రంధ్రగేప్యస్థే విష్ణుశాపాత్సుతక్షయః॥

తా॥ చంద్రుఁడు పంచమాధిపతియై ద్వాదశాధిపతితో గూడి గాని, చూడబడి గాని, యుండగా పుత్రకారకుడు ద్వాదశాష్టమములందుండెనేని విష్ణు శాపము వలన పుత్రనష్టము కలుగును.

శ్లో॥ పుత్రస్థానాధిపే భౌమే రంధ్రనాథయుతేక్షితే। కారకే నీచ రాశిస్థే విష్ణుశాపాత్సుతక్షయః॥

తా॥ కుజుఁడు పుత్రస్థానాధిపతియై అష్టమాధిపతితో గూడిగాని, చూడబడిగాని, యుండగా పుత్ర కారకుడు నీచరాశియందుండినయెడల విష్ణుశాపము వలన పుత్రనష్టము గలుగునని తెలుసికొనవలయును.

శ్లో॥ పుత్రస్థానాధిపే సౌమ్యే భౌమయుక్తే వ్యయంగతే। లాభే ధర్మేధనా కేంద్రే విష్ణుశాపాత్సుతక్షయః॥

తా॥ బుధుఁడు పంచమాధిపతియై కుజునితో గూడి -౧-౪-౬-౮-౧౦-౧౧-౧౨- స్థానములలో నెచ్చటనున్నను విష్ణుశాపమువలన పుత్రనష్టమగును.



శ్లో॥ పుత్రస్థానాధిపే జీవే శుక్రయుక్తే రిసంస్థితే। త్రికోణే వాథ కేంద్రేవా విష్ణుశాపాత్సుతక్షయః॥

తా॥ గురువు పుత్రస్థానాధిపతియై శుక్రునితో గూడి - ౧-౪-౫-౬-౭-౮-౧౦- స్థానములలో నెచ్చటనైన నున్నయెడల విష్ణుశాపమువలన పుత్రనష్టమగును.

శ్లో॥ పుత్రస్థానాధిపే శుక్రే రాహుభౌమయుతేక్షితే పుత్రస్థానే శుభైర్హీనే విష్ణుశాపాత్సుతక్షయః॥

తా॥ శుక్రుఁడు పంచమాధిపతియై కుజరాహువులతో గూడిగాని, చూడబడిగాని, యుండగా పుత్రస్థానమందు శుభగ్రహములు లేకుండినయెడల విష్ణుశాపము వలన పుత్రనష్టము గలుగును.

శ్లో॥ పుత్రస్థానాధిపే మందే కేతుభౌమయుతేక్షితే। రిపుయుక్తే థవా కూరే విష్ణుశాపాత్సుతక్షయః॥

తా॥ శని పుత్రస్థానాధిపతియై కుజకేతువులతో గూడిగాని, చూడబడిగాని యుండి శత్రురాశియందుగాని, పాపరాశియందుగాని, యున్నయెడల పుత్రనాశనమగును.

శ్లో॥ సుతనాథే బలైర్హీనే కారకే దుర్బలేపిచ। చంద్రాద్వా బలహీనేచ విష్ణుశాపం వదంతితమ్॥

తా॥ లగ్నమునకు గాని, చంద్ర లగ్నమునకు గాని, పంచమాధిపతి బలహీనుడయి యుండగా పుత్రకారకుడును బలహీనుడయ్యెనేని విష్ణుశాపమువలన సుతక్షయమగును.

శ్లో॥ విష్ణుశాపఫలం దేవి శృణుష్వావహితా ప్రియే। షణ్మాసా ద్గర్భపతనం భవిష్యతి క్వచిత్క్వగత్॥

తా॥ ఓ పార్వతీ సావధానముగా వినుము విష్ణు శాపఫలమును చెప్పెదను అప్పుడప్పుడు ఆఱుమాసములగర్భము నశించుచుండును.

శ్లో॥ ఆయుర్హీనః గర్భజాతః వత్సరాన్మరణాంశిశోః। జాతం జాతం వినాశేచ పంచాబ్దాన్మరణం శిశోః॥

తా॥ అప్పుడప్పుడు వకసంవత్సరమునకు శిశువు నశించును, వకప్పుడు అయిదు సంవత్సరములకు మృతినొందును, మొత్తముమీద అన్నిగర్భములందు శిశువులు ఆయుర్హీనములగును.

శ్లో॥ క్వచిత్క్వచిన్న వాబ్దాంతు మరణంచభవిష్యతి। ఇత్యుక్త్వా పరమప్రీత్యా భగవాన్వృషధ్వజః॥ తద్దోషపరిహారార్థం ప్రాయశ్చిత్తముపాచహ॥

తా॥ ఒకప్పుడు తొమ్మిదిసంవత్సరముల బాలుడు మృతినొందును, యిట్లు శివుడు పార్వతికి విష్ణుశాపలక్షణమును చెప్పి ఆదోషము నివారించుటకై ప్రాయశ్చిత్తము చెప్ప ప్రారంభించెను.

## విష్ణుశాప పరిహారః

శ్లో॥ విష్ణోశ్శాపపరిహారం శృణుపుత్రవివర్ధనం। గోప్యం సర్వేషు లోకేషు నృణామపి చ పుత్రదమ్॥

తా॥ విష్ణుశాప పరిహారమును వినుము, యిది పుత్రప్రదము, చాలా రహస్యము, మనుష్యులకు పుత్రకరమై యున్నది.

శ్లో॥ శ్రీకృష్ణమంత్రం జప్తవ్యం సాంగోపాంగం యథావిధి। కృష్ణయంత్రం తు సంపూజ్య యంత్రదానం కరోతి చేత్॥ కృష్ణశాపాద్విముచ్యేత లభేద్దీర్ఘాయుషం సుతం। శంభోస్తు వచనం శ్రుత్వా పునః పప్రచ్ఛ సానఘా

తా॥ షడంగన్యాససహితముగా శ్రీకృష్ణమంత్రమును జపించవలెను, కృష్ణయంత్రమును పూజించి చివరకు యంత్రమును దానము చేయవలెను, అట్లు చేసినయడల దీర్ఘాయుష్మంతుడగు కుమారుడు గలుగును, యిట్లు శివుడు చెప్పిన మాటవిని పార్వతీదేవి తిరిగి అడిగెను.

శ్లో॥ కృష్ణమంత్రం కథం శంభో జప్యం కింవా విధిశ్చ కః। కథం యంత్రసమారాధ్యం యంత్రదానం కథం విభో। ప్రతిమాపూజనం కింవా శంస శంభో నమోస్తుతే॥

తా॥ ఓ శంకరా! కృష్ణమంత్రము నెట్లు జపించవలయును, అందుకు విధియేది యంత్రపూజ యెట్లు చేయవలెను, యంత్రదానము నెట్లా చేయవలెను, ప్రతిమను యెట్లా పూజించవలెను యీసర్వమును చెప్పుము.

శ్లో॥ దేవ్యాస్తు వచనం శ్రుత్వా ప్రోవాచ వచనం పునః। శృణు దేవి ప్రవక్ష్యామి కృష్ణమంత్రం యథావిధి॥

తా॥ యీలాగున పార్వతి అడుగగా శివుడు తిరిగి చెప్పుచున్నాడు ఓ పార్వతీ వినుము కృష్ణమంత్ర విధానమును చెప్పెదను.

శ్లో॥ ఆదౌ కృత్వా తు సంకల్పం సర్వదోషనివృత్తయే। పుత్రపౌత్రాభివృద్ధ్యర్థం కరిష్యే కృష్ణపూజనమ్॥ ఇతి సంకల్ప్య విధివత్ కృష్ణమంత్రజపం చరేః। కృత్వా శ్రీకృష్ణయంత్రం తు ప్రతిమాం దారునిర్మితాం॥



తా॥ సమస్తదోష నివృత్తికొఱకును, పుత్రపౌత్రాభివృద్ధికొఱకును, శ్రీకృష్ణపూజను చేసెదను అని సంకల్పముచేసి కృష్ణమంత్రమును జపించి యంత్రమును పూజించవలెను ప్రతిమను కొయ్యతో చేయించవలెను.

## శ్రీకృష్ణయంత్రోద్ధారక్రమః.

శ్లో॥ ఔదుంబరే భద్రపీఠే విలిఖేత్పుత్రకామ్యయా। త్రికోణమధ్యే ప్రణవం షట్కోణం విలిఖేద్బహిః॥ తద్బహిశ్చాష్టకోణం స్యాద్భూపురం విలిఖేత్క్రమాత్। ద్వారే ద్వారే మంత్రరాజం లిఖిత్వా యంత్రరాజకమ్॥ మూలమంత్రం లిఖేత్కోణే మధ్యే సాధ్యమనుక్రమాత్। ఏవం లిఖిత్వా యంత్రం తు నవనీతేన లేపయేత్॥ యంత్రం స్పృష్ట్వా జపేన్మంత్రం పుత్రకామో దినే దినే। మండలాంతే లభేత్పుత్రం కృష్ణయంత్రప్రపూజనాత్॥

తా॥ సంతానార్థి అత్తిమాను కొయ్య యందు యంత్రమును చెక్కించవలెను, ముందు త్రికోణమును, దానిమధ్యను ఓంకారమును వ్రాయవలెను, తరువాత షట్కోణమును వ్రాయవలెను, దానిబయిట అష్టకోణమును వ్రాయవలెను, తరువాత భూపురమును లిఖించవలెను, ప్రతి ద్వారమందును మంత్రరాజమును వ్రాయవలెను, కోణములందు మూలమంత్రమును, మధ్యను సాధ్యమును వ్రాయవలయును. యిటుల వ్రాసి వెన్నచేత యంత్రమును పూసి ప్రతిదినమందు హస్తముతో యంత్రమును తాకుచు జపించవలయును. యీ యంత్రమును పూజించవలెను, యిటుల నలుబది రోజులు పూజించినయడల పుత్రుడు గలుగునని తా॥

## సంతానార్థం శ్రీకృష్ణప్రతిమాపూజాక్రమః.

శ్లో॥ ప్రతిమాపూజనం వక్ష్యే సంతత్యర్థం శృణుష్వహి। శ్రీవృక్షదారుసంభూతాం శిల్పినా నిర్మితాం శుభామ్॥ బాలరూపసమాయుక్తాం శుభలగ్నే సునిర్మితామ్। ప్రతిమాం పూజయేద్యస్తు నలభేత్పుత్రముత్తమం

తా॥ ప్రతిమా పూజను చెప్పెదను పార్వతీ వినుము, సంతాన కాముడు బిల్వవృక్షముయొక్క దారువును వడ్రంగిచేత బొమ్మగా చేయించవలయును, ఆప్రతిమ సుందరాంగములతో బాలకృష్ణ రూపముగా నుండవలెను యిట్టి ప్రతిమను పూజించిన యడల దీర్ఘాయుష్మంతుడగు కుమారుడు గలుగును.

## శ్రీకృష్ణమంత్రానుష్ఠానక్రమః.

శ్లో॥ పౌరుషేణ చ సూక్తేన ఋగ్భిష్షోడశభిః క్రమాత్। ధ్యానమావాహనం చైవ ఆసనం పాద్యమేవ చ॥ అర్ఘ్యమాచమనం స్నానం వస్త్రం

యజ్ఞోపవీతకం। గంధంపుష్పంతథాధూపం దీపంనైవేద్యమేవచ ॥ తాం బూలమంత్రి పుష్పంచ నీరాజనమతైవచ । ప్రదక్షిణం నమస్కారం ప్రార్థనాంచయథాక్రమం । ఋగ్భిష్షోడశభిఃకృత్వా మూలమంత్రం జపేత్తతః॥

తా॥ పురుషసూక్తమునందు యజుర్వేదులకు ౧౮- సూక్తములుండును, ఋగ్వేదులకు ౧౬- సూక్తము లుండును, అందు పూజకు ఋగ్వేద మనుబట్టి చెప్పుచున్నాడు, పురుష సూక్తమునందున్న పదియారింటిచేతను ధ్యానము,ఆవాహనము, ఆసనము,పాద్యం, అర్ఘ్యము, ఆచమనము, స్నానము, వస్త్రము, యజ్ఞోపవీతము, గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, మంత్రపుష్పము, నీరాజనము, ప్రదక్షిణము, నమస్కారము, ప్రార్థన, అనుఉపచారములను చేయవలెను, యిందు తక్కువైన యుపచారములకులేదు మంత్రములు నుపయోగించవలయును, యిటులపూజించినతరువాత మూలమంత్రమును జపించవలెను మూలమంత్రమును చెప్పెదనువినుము.

శ్లో॥ దేవకీసుతగోవింద వాసుదేవజగత్పతే । దేహిమేతనయం కృష్ణ త్వామహం శరణంగతః ॥ ఏతన్మంత్రం జపేద్యస్తు సలభేత్పుత్ర ముత్తమమ్॥

తా॥ మూలమంత్రము దేవకీసుతగోవింద వాసుదేవజగత్పతే । దేహిమేతనయం కృష్ణ త్వామహంశరణంగతః॥ అర్థము, దేవకీదేవి కొమారుడాగోపులనుకాపాడువాడా వసుదేవునికొడుకా జగములకు రక్షకా నేనునిన్ను శరణుజొచ్చినాను నాకు కుమారునివ్వ వలయును యిట్లీ మంత్రమును జపించువాడు పుత్రునిబొందును.

శ్లో॥ అస్యశ్రీకృష్ణమంత్రస్య ఋషిర్నారదఉచ్యతే। ఛందోనుష్టుప్తథాప్రోక్తో భగవాన్ దేవకీసుతః ॥కృష్ణప్రసాదసిద్ధ్యర్థే వినియోగస్సుతార్థదః। క్లాంక్లీంక్లూమితిబీజంతు శక్తికీలకముచ్యతే॥ దేవకీసుత గోవింద వాసుదేవజగత్పతే। దేహిమేతనయంకృష్ణ త్వామహంశరణం గతః॥ మూలమంత్రేణసంయుక్తం క్లాద్యాదిమడక్షరైః। అంగన్యాసకర న్యాసం కృత్వాధ్యానమతఃపరమ్॥ పంచోపచారపూజాంచ కృత్వాతు విధివత్తతః। వైకుంఠాదాగతంకృష్ణం రథస్థంకరుణానిధిమ్॥ కిరీటిసారథిం పుత్రిమానయంతంజగత్పతిం । రథస్థపుత్రమాదాయ గురువేవైదికాయచ॥ అర్పయంతంసుతాక్షణంతం భావయేదచ్యుతంసుధీః। శంఖంచక్రం గదాంపద్మం ధారయంతంజగత్పతిమ్॥ అంకేశయానందేవక్యా సుముఖం



మందిరేసుభే ఏవంరూపంబాలకృష్ణ భావయేదచ్యుతంసుధీః । ఇతిధ్యాత్వాతతోమంత్రం జపేచ్ఛనియతశ్శుచిః॥

తా॥ ఈ కృష్ణమంత్రమునకు నారదుడు ఋషి, అనుష్టుప్, ఛందస్సు, భగవాన్ దేవకీసుతః, అనిదేవత, సంతానార్థము వినియోగము, క్లాంబీజము,క్లీంశక్తి, క్లూం కీలకము ౧ క్లాం దేవకీసుత, ౨ క్లీం గోవింద, ౩ క్లూం వాసుదేవ, ౪ క్లైం జగత్పతే, ౫ క్లౌం దేహిమేతనయంకృష్ణ, ౬ క్లః త్వామహం శరణంగతః, అని మూలమంత్ర విభాగముతో గూడిన క్లామిత్యాదులచేత అంగన్యాస కరన్యాసములను చేయవలయును, తరువాతపంచ పూజలుచేయవలయును, తరువాత వైకుంఠాదాగతం,భావయేదచ్యుతంసుధీః, అనిధ్యానమునుచేసి తరువాత మూలమంత్రమును జపించవలెను. ధ్యానశ్లోకార్థము, వైకుంఠము నుంచి భూలోకమునకువచ్చి అర్జునునకు సారధిగా వున్నటువంటిన్ని, గురుపుత్రునివెదకి తెచ్చినటువంటిన్ని, శంఖమును చక్రమును గదను పద్మమును ధరించినటువంటిన్ని, దేవకీదేవితొడయందు శయనించినటువంటి శ్రీకృష్ణరూపమును ధ్యానమందుస్మరించవలయును.

### శ్రీకృష్ణప్రతిమాదానక్రమః.

శ్లో॥ జపాంతేచపునర్ధ్యానం ప్రార్థయేదచ్యుతంపునః । దేవదేవ జగన్నాథ భక్తానామభయప్రద॥ నివార్యమమపాపాని పుత్రంమేదేహి కేశవ । ఏవంకృత్వామండలాంతే ప్రతిమాం వేదపారగే॥ వస్త్రాలంకారసంయుక్తాం దద్యాత్తాందక్షిణాయుతా । శ్రీకృష్ణప్రతిమాందాస్యే వంధ్యాదోషనివృత్తయే । దానేనానేనసుప్రీతో జీవపుత్రంచ దేహిమే॥ ౩౪॥

తా॥ జపముకాగానే తిరిగి "దేవా భక్తసంరక్షకా జగన్నాథా మన్నాథా నాపాపములను నశింపజేసి నాకు పుత్రునిమ్ము" ఇట్లు ధ్యానించవలయును. ఇట్లు నలుబది రోజులుచేసి అంతమందు ప్రతిమను "కృష్ణా నీప్రతిమనుదానముచేయుచున్నాను యీదానమువలన నావంధ్యాదోషము నశించి నాకు కుమారుడు గలుగవలయును" అని ప్రార్థించుచు వేదముచదువుకొన్న బ్రాహ్మణునకు దానమిచ్చి దాన సాద్గుణ్యసిద్ధికిగాను దక్షిణయివ్వవలయును ప్రతిమకు వస్త్రముసుగట్టి దానమివ్వవలయును.

### వంధ్యాదోషభేదాజ్జపతారతమ్యమ్

శ్లో॥ కాకవంధ్యాసమాయుక్తో జపేత్పంచసహస్రకం। కదళీవంధ్యయాయుక్తో దశసాహస్రకంజపేత్ । స్రావగర్భయుక్తోమర్త్యో జపేద్వింశత్సహస్రకమ్ । మృతప్రజాసమాయుక్తో జపేత్త్రింశత్సహస్రక

మ॥ అపత్రీజావంధ్యయాయుక్తో జపేత్త్రింశత్సహస్రికమ్ । దశాంశైకం తర్పణంచ తద్దశాంశైకమాహుతిమ్ ॥ బ్రాహ్మణాన్భోజయేత్పశ్చా త్తద్దశాంశైకసంఖ్యయా । ఏవంకృష్ణంచమభ్యర్చ్య తన్మంత్రింతుజపే త్సదా॥ అచిరాల్లభతేపుత్రం దీర్ఘాయుష్మంతిముత్తమం । ఇదంతుగిరి జేనిత్యం గోపనీయంప్రయత్నతః॥

తా॥ కాకవంధ్యకు అయిదువేలు జపమును, కదళీవంధ్యకు పదివేలు జపమును, స్రావగర్భముకు యిరువదివేలును, మృతసంతానముకు ముప్పదివేలును, అనపత్యతకు ముప్పదివేలును, జపముచేయవలయును. జపదశాంశము తర్పణము, తర్పణదశాంశము హోమము, హోమదశాంశము బ్రాహ్మణభోజనమును చేయించవలయును. ఇట్లు కృష్ణ పూజా జపాదికమును చేసినయడల శీఘ్రముగా పుత్రుడు గలిగి దీర్ఘాయుష్మంతుడగు ను. ఓపార్వతీ యిదిచాలారహస్యము బహుప్రయత్నముతో గుట్టుగానుంచుము.

శ్రీకృష్ణమూలమంత్రవిధానము.

అస్య శ్రీసంతానగోపాలకృష్ణమహామంత్రస్య - నారదఋషిః- అనుష్టుప్ఛందః- శ్రీసంతానగోపాలకృష్ణోదేవతా, క్లాం - బీజం, క్లీం- శక్తిః, క్లూం- కీలకం, శ్రీసంతానగోపాలకృష్ణప్రీత్యర్థే సంతానార్థేజపే వినియోగః- క్లాం- దేవకీసుత అంగుష్ఠాభ్యాంనమః, క్లీం - గోవింద తర్జనీభ్యాంనమః, క్లూం- వాసుదేవమధ్యమాభ్యాంనమః, క్లైం - జగ త్పతే అనామికాభ్యాంనమః, క్లౌం- దేహిమేతనయంకృష్ణ- కనిష్ఠికా భ్యాంనమః, క్లః - త్వామహం శరణంగతః - కరతలకరపృష్ఠాభ్యాం నమః-ఏవంహృదయాదిన్యాసః॥భూర్భువస్సువరోమితిదిగ్బంధః॥ధ్యానం॥ వైకుంఠాదాగతంకృష్ణం రథస్థంకరుణానిధిం । కిరీటిసారథింపుత్రమాన యంతంజగత్పతిం॥ రథస్థంపుత్రమాదాయ గురవేద్విదిశాంయచ। అర్ప యంతంసుతార్థంతం భావయామ్యహమచ్యుతం । శంఖంచక్రంగదాం పద్మం ధారయంతంజగత్పతిమ్ ॥ అంకేశయానందేవక్యా స్సుముఖం మందిరేసుభే । ఏవంరాజంబాలకృష్ణం భావయామ్యచ్యుతంసదా॥ ఇతి ధ్యాత్వా॥ లమిత్యాదిపంచపూజాంకృత్వా॥ మూలమంత్రః॥ఓం-శ్రీం- హ్రీం-క్లీం- గ్లాం- దేవకీసుతగోవింద వాసుదేవజగత్పతే । దేహిమే తనయం కృష్ణత్వామహంశరణంగతః, శ్రీం-హ్రీం-క్లీం- స్వాహా॥ ఇతి



జపిత్వా- పునఃహృదయాదిన్యాసంకృత్వా- సమర్పయేత్ - పురశ్చర ణవిషయే నారాయణగాయత్ర్యా సహస్రజపంకుర్యాత్॥

ఇతి సంతానరత్నాకరే దశమపటలస్సమాప్తః.

---

ఏకాదశాధ్యాయ ప్రారంభః.

స్త్రీశాపలక్షణ ప్రతిపాదకమ్.

శ్లో॥ అతఃపరంప్రవక్ష్యామి స్త్రీదోషాత్సుతక్షయః।
శృణుష్వగిరిజేప్రీత్యా సమ్యక్సుతవివృద్ధిదమ్॥

తా॥ పార్వతీ తరువాత స్త్రీదోషమువలన సంతాననష్టము గలుగుటను తెలి యచెప్పెదను వినుము వినువారికి సంతానము గలుగును.

స్త్రీశాపాత్పుత్రనాశయోగః.

శ్లో॥ చంద్రశ్చంద్రజకామస్థే తదీశేరిఃఫరాశిగే।
రిఃఫాధిపేసుతస్థేచ స్త్రీదోషాత్సుతక్షయః॥

తా॥ చంద్రుడు బుధునకు సప్తమమందును బుధుడున్న రాశ్యధిపతి ద్వాదశమం దును, ద్వాదశాధిపతి పంచమమందును వున్నయడల స్త్రీదోషమువలన సంతాననష్టము గలుగుచుండును.

మాతృశాపాత్పుత్రనాశయోగః.

శ్లో॥ జీవారార్కాస్ఫుజిత్స్వేకో చంద్రేణసహసంస్థితః।
కామస్థఃకామరాశీశో మాతృశాపాత్సుతక్షయః॥

తా॥ కుజ గురు రవి శుక్రులలో నెవ్వరైనను చంద్రునితో చేరియుండగా సప్త మాధిపతి సప్తమమందున్నయడల మాతృశాపమువలన పుత్రనష్టము గలుగును.

శ్లో॥ మాతృస్థానాధిపేచంద్రే పుత్రస్థేరాహుసంయుతే।
కారకేకామరాశిస్థే మాతృశాపాత్సుతక్షయః॥

తా॥ చంద్రుడు మాతృస్థానాధిపతియై రాహువుతో గూడి పంచమమందుండగా పుత్రకారకుడు సప్తమమందున్నయడల మాతృశాపమువలన పుత్రనష్టముగలుగును.

శ్లో॥ సుతస్థానస్థితేమందే చంద్రదృష్టియుతేధవా॥
శుక్రేణవాయుతేదృష్టే మాతృశాపాత్సుతక్షయః॥

తా॥ శని పంచమమందుండి చంద్రునితోగాని శుక్రునితోగాని గూడియున్నను లేక చూడబడియున్నను మాతృశాపమువల్ల పుత్రనష్టము గలుగును.

శ్లో॥ శుభేసుభాశుభైర్యుక్తే తదీశేవ్యయరాశిగే।
వ్యయాధీశేసుతస్థేచ స్త్రీదోషాత్సుతక్షయః॥

తా॥ నవమస్థానమందు శుభగ్రహములు పాపగ్రహములునుండి నవమాధిపతి ద్వాదశమందుండి ద్వాదశాధిపతి పంచమమందున్నయెడల స్త్రీదోషమువల్ల సంతాన నష్టము గలుగును.

శ్లో॥ పంచమేసౌమ్యసంయుక్తే పంచమేశేస్తరాశిగే।
కారకే స్త్రీగ్రహేద్విఃషే షష్ఠాష్టమసుఖేస్తగే॥

శ్లో॥ శుభగ్రహదృశాహీనే నవమేనవమాధిపే।
గురుస్త్రికోణలాభస్థే మాతృశాపాత్సుతక్షయః॥

తా॥ పంచమమందు బుధుడును, ఆపంచమాధిపతి అస్తరాశియందును, పుత్రకారకుడు స్త్రీరాశులందుగాని, ద్వాదశమందుగాని షష్ఠాష్టమములందుగాని చతుర్థమందుగాని అస్తరాశియందుగాని యుండగాను నవమాధిపతి శుభదృష్టిలేక నవమమందుండగాను, బృహస్పతి ౯-౫-౧౧ స్థానములందుండినయెడల మాతృశాపమువల్ల సంతాన నష్టము గలుగును.

శ్లో॥ సుతస్థేభానుభాసస్థే చంద్రేపాపయుతేక్షితే।
గురుదృష్టివిహీనేచ తత్ స్త్రీదోషాద్భవిష్యతి॥

తా॥ పంచమాధిపతి ద్వాదశమందుండగా చంద్రుడు పాపగ్రహ సంబంధము గలిగి గురుదృష్టిలేకయున్న యెడల స్త్రీదోషమువల్ల సంతాన నష్టము గలుగును.

శ్లో॥ కామస్థౌశశిశుక్రౌచ సుతేశేనయుతేక్షితౌ।
కారకేబుధసంయుక్తే స్త్రీదోషంతద్భవిష్యతి॥

తా॥ చంద్రశుక్రులు పంచమాధిపతితో గూడిగాని చూడబడిగాని యుండగా పుత్రకారకుడు బుధునితోగూడియున్న యెడల స్త్రీదోషము వలన సంతాన నష్టము గలుగును.

శ్లో॥ నవమేగురుసంయుక్తే తదీశేలగ్నరాశిగే।
లగ్నేశేపంచమస్థేవా మాతృశాపాత్సుతక్షయః॥

తా॥ బృహస్పతి నవమమందును, ఆనవమాధిపతి లగ్నమందును, లగ్నాధిపతి పంచమమందును వున్నయెడల మాతృశాపమువలన సంతాన నష్టము గలుగును.



### మాతృశాప పరిహారః.

శ్లో॥ తద్దోషపరిహారార్థం ప్రాయశ్చిత్తంశృణుష్వభో।
పౌరుషేణచసూక్తేన ప్రాయశ్చిత్తంకరోతిచేత్॥
ఆయుష్మంతంసుతంలబ్ధ్వా మోదతేభువిమానవః॥

తా॥ ఓపార్వతీ పైనచెప్పిన దోషములకు ప్రాయశ్చిత్తమును చెప్పెదనువినుము. పురుషసూక్తముచేత ప్రాయశ్చిత్తమును చేసిన యెడల దీర్ఘాయువు గలిగిన కుమారుడు గలిగి సుఖించును.

శ్లో॥ ఇతిశ్రుత్వాశుభంవాక్యం శంకరస్యముఖోదితమ్।
పప్రచ్ఛపార్వతీనాథం మాతృశాపనివారకమ్॥
ప్రాయశ్చిత్తంవిధాతవ్యం కేనవావిధినాహర।
కస్మిన్దినేచకర్తవ్యం విధితంబ్రూహిశంకర॥

తా॥ ఇట్లు శివుడు చెప్పగా విని పార్వతీ భర్తను గురించి యిట్లనియె ఓశంకరా మాతృశాపనివారణముకు యేప్రాయశ్చిత్తమును చేయవలయును దాని విధియేది యెప్పుడు చేయవలయును యీవిషయము నంతను నాకుచెప్పుము.

శ్లో॥ ప్రియయాప్యేవముక్తస్తు పునఃప్రోవాచశంకరః
పరందేవిప్రవక్ష్యామి స్త్రీదోషాత్సుతక్షయః॥
ప్రాయశ్చిత్తంశృణుష్వాద్య గిరిజేసుతవృద్ధిదమ్॥

తా॥ ఇట్లు పార్వతీ దేవి అడుగగా విని శంకరుడు తిరిగి చెప్పుచున్నాడు, పార్వతీ ముందువినుము స్త్రీదోషము వలన సుతనాశనము గలుగు దోషమునకు ప్రాయశ్చిత్తమును చెప్పెదను.

### చరుహోమప్రక్రమః

శ్లో॥ శుక్లపక్షేశుభేవారే శుభనక్షత్రగోచరే।
ద్వాదశ్యాంపుత్రకామస్తు చరుంకుర్వీతవైష్ణవమ్॥
చరుంపురుషసూక్తేన [illegible] పుత్రకామ్యయా।
ప్రాప్నుయాద్వైష్ణవంసూను [illegible]॥

తా॥ శుక్లపక్షమందు ద్వాదశినాడు శుభవాసరమందు పుత్రకాముడై సంకల్పముచేసి చరువును సిద్ధపరచి పురుషసూక్తముతో [illegible] హోమమును చేసిన యెడల సుపుత్రుడు గలిగి వంశమును వృద్ధిపరచును.

శ్లో॥ ద్వాదశ్యాంపయసాసమ్యక్ నిర్వపేద్వైష్ణవంచరుం।
స్వగృహ్యాగ్న్యౌచరుంసమ్యక్ శ్రపయేత్స్నాతశ్శుచిః॥

తా॥ ద్వాదశినాడు స్వగృహ్యాగ్నియందు ఆవుపాలతో విష్ణుప్రీతికరమైన చరువును శుచిగా తయారుచేయవలయును.

శ్లో॥ చరుంనిర్వాపణంకృత్వా ప్రోక్షణంచవిధిక్రమః।
ఋగ్భిష్షోడశభిస్తత్ర హునేత్పురుషసూక్తతః॥

తా॥ ఇట్లు చరువును సిద్ధపఱచి విధిప్రకారము చొప్పున ప్రోక్షించి దానితోనే పదియారుమాఱులు పురుషసూక్తముతో హోమమును చేయవలయును.

శ్లో॥ అశ్వత్థసమిధాజ్యైశ్చ హునేత్పురుషసూక్తతః।
చరుహోమంతతఃకృత్వా ఋగ్భిష్షోడశభిఃక్రమాత్॥

తా॥ ఆహోమమందు అశ్వత్థసమిధలును ఆజ్యమునుగూడ యుపయోగపర్చవలయును.

శ్లో॥ అగ్నేస్తుపురతఃస్థాప్య పర్ణమశ్వత్థసంభవం। పత్రేసంపాతమేకైకం నిధాయాహుతిశేషతః॥ ఆజ్యహోమంతతఃకృత్వా తత్సూక్తేనపునఃపృథక్। సంపాతేష్వాజ్యశేషేణ నినీయచనృసూక్తతః॥ స్విష్టకృద్ధోమమంత్రేణ కుర్యాదాజ్యాదిహోమకం। స్వగృహ్యోక్తేనమార్గేణ హోమశేషంసమాపయేత్॥

తా॥ అగ్ని ముందర అశ్వత్థపర్ణమునుంచి చర్వాహుతిశేషము వక్కొక్కభాగమును ఆపత్రమందుంచి తరువాత ఆజ్యహోమమును పురుషసూక్తముతోనేచేసి ఆచరుశిష్టములం దాజ్యమునుగలిపి స్విష్టకృద్ధోమమును చేయవలెను. తరువాత గృహ్యానూత్రప్రకారముగా హోమశేషమును సమాప్తిజేయవలయును.

శ్లో॥ అశ్వత్థపత్రేసంపాతం నిధాయచనృసూక్తతః। స్పృష్ట్వోదర్భాదినాపత్నీం జపేత్తత్సూక్తకంపునః॥ తత్సంపాతంపృథఙ్మంత్రైః ప్రత్యృచంప్రాశయేత్క్రమాత్। పత్నీతేనైవపర్ణేన జలంతత్సూక్తతఃపిబేత్॥ తత్పత్న్యాభిదేశంతు స్పృష్ట్వాదర్భైఃకరేణవా। పౌరుషేణచసూక్తేన జపేత్షోడశవారతః॥ తతఃకృత్వాత్విదంకర్మకర్తవ్యం ద్విజభోజనం। పాయసాన్నంతుదాతవ్యం శ్రోత్రియాయకుటుంబినే॥ యథావిభవవిస్తారం తథాకర్తవ్యమేవచ। ఏవంయఃకురుతేమర్త్యో లభే



దీర్ఘాయుషంసుతమ్॥ మాతృశాపాద్విముచ్యేత స్త్రీదోషాన్ముచ్యతేక్షణాత్। ఇదంతుగిరిజేన్నిత్యం నప్రకాశ్యంకదాచన॥ అపుత్రామృతపుత్రావా యాచకన్యాంప్రసూయతే। క్షిప్రంసాజనయేత్పుత్రం పౌత్రంనప్తృసమన్వితమ్॥

తా॥ అశ్వత్థపత్రమందు సంపాతమును పురుషసూక్తముచేత ఆచ్ఛాదించి దర్భలచేతగాని హస్తముచేతగాని భార్యను తాకియుండి పురుషసూక్తమును జపించవలయును, తరువాత పురుషసూక్తమందుండు ప్రతిఋక్కుచేతను ఆసంపాతములను భార్యచేత భుజింపచేయవలయును. ఆయశ్వత్థపత్రముతోనే పురుషసూక్తముతో భార్యకు జలపానమును చేయించవలయును. భార్యయొక్క నాభిదేశమును దర్భతోగాని హస్తముతోగాని తాకుచు పదహారుపర్యాయములు పురుషసూక్తమును జపించవలయును. ఇట్లు చేసి తరువాత బ్రాహ్మణసమారాధన చేయవలయును. శ్రోత్రియుడును కుటుంబవంతుడునగు బ్రాహ్మణునకు పరమాన్నమును వాయనమివ్వవలయును. యిదంతయు ధనవంచనలేక తనశక్తినిబట్టిచేయవలయును. యిట్లు చేసిన యెడల మాతృశాపమును స్త్రీదోషమును నశించును. దీర్ఘాయుష్మంతుడగు కుమారుడు గలుగును. యిట్లు రహస్యమైన దానిని నీకు చెప్పితిని గనుక యెచ్చటను వెల్లడిచేయకుము అసలు సంతానములేని స్త్రీగాని సంతానము గలిగి నశించుచుండు స్త్రీగాని యెల్లప్పుడును ఆడపిల్లలనే కనుచుండు స్త్రీగాని ఈప్రకారముగా పురుషసూక్తముతో చరుహోమమును శ్రీవిష్ణుప్రీతిగా చేయించిన యెడల పైనచెప్పిన త్రివిధదోషములు నశించి శీఘ్రకాలమునందే చిరంజీవి యగును పుత్రునిగనును. తరువాత తొందరగానే మనుమడు గలుగును. తరువాత మునిమనుమడు గలుగుదురు యిట్లు వంశము వర్ధిల్లును.

ఇతి సంతానరత్నాకరే ఏకాదశపటలస్సమాప్తః.

---

## అథ ద్వాదశపటలప్రారంభః.

### సర్పశాప పరిహారః.

శ్లో॥ అతఃపరంప్రవక్ష్యామి సర్పశాపాద్విమోచనం।
లగ్నాత్పంచమగేరాహౌ చంద్రాద్వాపంచమేఫణీ॥
నవమేవాథచంద్రాద్వా సంస్థితేఫణినాయకే।
కారకేబలహీనేవా సర్పశాపాత్సుతక్షయః॥

తా॥ తరువాత సర్పశాపమువలన గలిగెడి పుత్రనష్టమును తెలుసుకొను విధమును చెప్పెదను వినుము రాహువు లగ్నమునకుగాని చంద్రలగ్నమునకుగాని పంచమ

మందుగాని నవమమందుగా యుండగా పుత్రకారకుడు బలములేనివాడై యుండిన యెడల సర్పశాపమువలన సంతాన నష్టముగలుగునని తెలుసికొనవలయును.

సర్పశాపాత్పుత్రనాశయోగః.

శ్లో॥ సుతేశేరాహు సంయుక్తే చంద్రసూర్యయుతేక్షితే।
కారకేశత్రురాశిస్థే సర్పశాపాత్సుతక్షయః॥

తా॥ పంచమాధిపతి రాహువుతోగూడి సూర్యచంద్రులతోగూడిగాని చూడబడిగాని యుండగా పుత్రకారకుడు శత్రురాశియందున్న యెడల సర్పశాపమువలన సుతక్షయము సంభవించును.

శ్లో॥ శుభేశేవ్యయరాశిస్థే వ్యయేశేశుభరాశిగే।
కారకేపాపసంయుక్తే సర్పశాపాత్సుతక్షయః॥

తా॥ నవమాధిపతి ద్వాదశమందును ద్వాదశాధిపతి నవమమందును యుండగా పుత్రకారకుడు పాపగ్రహముతో జేరియున్న యెడల సర్పశాపమువలన పుత్రనష్టము గలుగును.

శ్లో॥ పుత్రస్థానంగతేరాహౌ పుత్రేశసహితేథవా।
శుభైరవీక్షితేకేంద్యాత్సర్పశాపాత్సుతక్షయః॥

తా॥ రాహువు పుత్రస్థానమును పొందిగాని పంచమాధిపతితోగూడిగానియుండి శుభగ్రహములచేత చూడబడకయుండెనేని సర్పశాపమువలన సంతానము నశించును.

శ్లో॥ నవమాధిపతౌభౌమే కేతుయుక్తేవ్యయంగతే।
పంచమేపాపసంయుక్తే సర్పశాపాత్సుతక్షయః॥

తా॥ అంగారకుడు నవమాధిపతియై కేతువుతోగూడి ద్వాదశమందుండగా పంచమమందు పాపగ్రహములున్నయెడల సర్పశాపమువలన సుతనష్టము గలుగును.

శ్లో॥ సుతస్థానాధిపేసూర్యే రాహుమాందియుతేక్షితే।
గురౌపాపసమాయుక్తే దోషస్సర్పాద్భవిష్యతి॥

తా॥ సూర్యుడు పంచమాధిపతియై రాహుగుళికగ్రహములతోగూడిగాని చూడబడిగాని యుండగా బృహస్పతి పాపగ్రహముతోగూడియున్న యెడల సర్పశాపమువలన సంతాన నష్టము గలుగును.

శ్లో॥ సుతేశేనీచసంయుక్తే సుతస్థానేస్థితేభృగౌ।
గురుదృష్టియుతేవాపి సర్పశాపాత్సుతక్షయః॥



తా॥ పంచమాధిపతి నీచయందుండగా శుక్రుడు పంచమమందుండి గురువుచేత చూడబడుచున్న యెడల సర్పశాపమువల్ల సంతానము నశించును.

శ్లో॥ సుతస్థానాధిపేచంద్రే బుధేనసహితేక్షితే।
రాహుదృష్టియుతేచంద్రే సర్పదోషాత్సుతక్షయః॥

తా॥ చంద్రుడు పంచమాధిపతియై బుధునితోగూడిగాని చూడబడిగాని యుండి రాహువుచేత చూడబడుచున్న యెడల సర్పశాపమువలన సంతాననష్టము గలుగును.

శ్లో॥ సుతనాథేబుధేరాహు ర్దృష్టియుక్తేవ్యయేగురౌ।
రంధ్రేశసహితేలగ్నే సర్పశాపాత్సుతక్షయః॥

తా॥ బుధుడు పుత్రస్థానాధిపతియై రాహువుచేత చూడబడుచు ద్వాదశమందుండగా గురువు అష్టమాధిపతితోగూడి లగ్నమందున్న యెడల సర్పశాపమువలన సంతాన నష్టము గలుగునని తెలియవలయును.

శ్లో॥ మూర్తౌశుక్రేరిపౌచంద్రే కామేవ్యోమ్నిధరాసుతే।
రిఃఫేసుతేశసహితే రాహుయుక్తేగురౌశుభే॥
సర్పశాపాత్సుతస్యాయుః క్షీయతేనాత్రసంశయః॥

తా॥ లగ్నమందు శుక్రుడును, షష్ఠమమందు చంద్రుడును, సప్తమదశమముల లోనొకదానియందు కుజుడును, పంచమాధిపతి ద్వాదశమందును, గురువు రాహువుతోజేరి నవమమందును వున్నయెడల సర్పశాపమువలన సంతానమున కాయుష్యము నశించునని తెలియదగినది.

శ్లో॥ పంచమాధిపతౌజీవే మందదృష్టియుతేరిపౌ।
తత్స్థానాధిపతౌచంద్రే కేతుయుక్తేసరీసృపాత్॥

తా॥ బృహస్పతి పంచమాధిపతియై శనిదృష్టితోగూడి షష్ఠమమందును చంద్రుడు షష్ఠాధిపతియై కేతువుతోను యుండిన యెడల సర్పశాపమువలన సంతాన నష్టము గలుగును. యీశ్లోకోక్తప్రకారముగా రోగము పుట్టుటను గుణించి బుద్ధిమంతు లూహింతురుగాత.

మార్జాలహననాత్పుత్రనాశయోగః.

శ్లో॥ సుతస్థానాధిపేమందే మాందియుక్తేవ్యయంగతే।
కారకేరిఃఫరంధ్రారి భావాంత్రేష్వధితిష్ఠతి॥
మార్జాలహననాత్పాపా త్పుత్రనాశోభవిష్యతి॥

తా॥ శని పంచమాధిపతియై గుళికునితోగూడి ద్వాదశమందుండగా పుత్రకారకుడు ౬-౮-౧౨ స్థానములందున్న యడల పిల్లిని చంపిన పాతకము వలన పిల్లలుబ్రతుకరని తెలుసుకొనవలయును.

శ్లో॥ సుతనాథేబుధేమాంది దృష్టియుక్తేనిశాకరే।
గురౌరిఃఫారిరంధ్రస్థే తథామార్జారహింసనాత్॥

తా॥ బుధుడు పంచమాధిపతియై యుండగా చంద్రుడు గుళికునిచే చూడబడుచుండగా బృహస్పతి ౬-౮-౧౨ స్థానములందున్న యడల పిల్లిని చంపిన పాతకమువలన పిల్లలుబ్రతుకరని తెలుసుకొనవలయును.

శ్లో॥ సుతేశేస్తగతేనీచ గ్రహేష్వేకోథవాబహు।
కార్యేరాహుయుతేవాపి తథామార్జారహింసనాత్॥

తా॥ పంచమాధిపతి నీచయందుండేగా యితరగ్రహములలో నొకటిగాని కొన్నిగాని నీచంగతులై రాహువు దశమమందున్న యడల పిల్లిని చంపిన దోషమువల్ల పిల్లలు బ్రతుకరని తెలుసుకొనవలయును.

శ్లో॥ సర్పసంహారదోషేణ కులక్షయకరంభవేత్।
జన్మాంతరసహస్రేషు గూడపాధనసంయది॥
పునఃపునశ్చదోషాణాం కల్పితంకర్మబంధనాత్।
తథామార్జారహననా త్కులక్షయకరంభవేత్॥

తా॥ పూర్వము అనేకవేల జన్మముల క్రిందటనైనను చేసిన సర్పహత్య, మార్జారహత్యయు వృద్ధినొంది పాపముపెరిగి యిప్పుడు వంశమును వృద్ధి గానివ్వకుండా పుత్రనష్టమును చేయుచుండును. అనేకవేల జన్మములందు చేసిన హత్యయనియు చెప్పవచ్చునుగాని అది అంతగా కుదిరి యుండేదు.

మృతసర్ప సర్పాండనయోభేదాత్పుత్రనాశక్రమః.

శ్లో॥ ఏకయాసశిశోర్నాశా దేకాబ్దశిశునాశనమ్।
మాసయుగ్మశిశోర్నాశా ద్వ్యబ్దశిశునాశనమ్॥
త్రైమాసికశిశోర్నాశా దబ్దత్రయశిశోర్మృతిః।
ఏకమాసస్యచైకైక మష్టమాబ్దంయథాక్రమమ్॥

తా॥ ఒక మాసము వయస్సుగల సర్పశిశువును చంపిన యడల తనకు ఒక సంవత్సరము వయస్సుగల కుమారుడు నశించును. రెండుమాసముల వయస్సుగల సర్పశిశువును చంపిన యడల రెండు సంవత్సరముల వయస్సుగల పుత్రుడు నశించును. మూడు



మాసములు వయస్సుగల సర్పశిశువును చంపిన యడల మూడు సంవత్సరములు వయస్సుగల కుమారుడు కూలిపోవును. యిట్లు యొకమాసమునకు సంవత్సరము వంతున వయస్సును తెలుసుకొనవలయును. యెనిమిది మాసముల సర్పశిశువును చంపిన యడల యెనిమిది సంవత్సరములు వయస్సుగల కుమారుడు నశించును. యిట్లుగానే మార్జాలశిశునాశనమందును వయోభేదమును తెలుసుకొనవలయును.

శ్లో॥ శతద్వయోర్ధ్వసర్పస్య చతుశ్చత్వారిసంఖ్యకమ్। అండంసర్పస్యవిజ్ఞేయం దోషస్స్యాదండనాశనే। ఏకాండనాశనేచైవ ఏకగర్భస్యనాశనమ్। తథాసర్పస్యచాండస్య ఏకైకస్యయథాక్రమమ్॥ విజ్ఞేయం గర్భనాశంచ శ్రేయసేబుద్ధివిస్తరాత్॥

తా॥ సర్పమునకు ౨౪౪ యిన్నూట నలభై నాలుగు అండములు గలుగును. అండమనగా గుడ్డు అట్టి అండనాశమువలన దోషము గలుగును. ఒక అండమును నశింపజేసిన యడల ఒకగర్భము నశించును అట్లుగానే అండసంఖ్యనుబట్టి గర్భనాశసంఖ్యను తెలుసుకొనవలయును. యీవిషయమును బుద్ధిమంతుడు క్షేమము కొఱకు బాగుగా విచారించుకొనవలయును.

సర్పశాపనివారక ప్రాయశ్చిత్తప్రకారః.

శ్లో॥ ఏతయోఃపాపయోర్దేవి ప్రాయశ్చిత్తమిహైకథా।
తద్దోషపరిహారార్థం శాంతింకుర్యాద్యథావిధి॥

తా॥ ఓపార్వతీ యీసర్పమార్జార హననదోషములకు రెంటికి ప్రాయశ్చిత్తము మొక్క పర్యాయమే చేసుకొనవలయును. గనుక ఆప్రకారముగా శాంతిని జేసుకొనవలయును.

శ్లో॥ శుభేదినేశుభేఋక్షే సులగ్నేసుముహూర్తకే।
వేదశాస్త్రార్థతత్వజ్ఞ మాచార్యంవరయేత్తతః॥

తా॥ తిధివార నక్షత్రములు మంచివిగా జూచి సుముహూర్తమందు వేదశాస్త్రములు చదువుకొనిన బ్రాహ్మణుని ఆచార్యునిగా కోరి వరించవలయును.

శ్లో॥ తాదృశాన్బ్రాహ్మణానష్టౌ ఋత్విగర్థేనియోజయేత్। కర్తాపత్నీసమేతశ్చ బ్రాహ్మణాంస్త్రిప్రదక్షిణమ్॥ నమస్కారంతతఃకృత్వా విజ్ఞాప్యపరిమన్ముఖమ్ సంకల్పమపిపుణ్యాహం పంచగవ్యంయథావిధి॥ శిష్టకర్మాణిసర్వాణి ఆచార్యస్యముఖాత్తతః। తతఃపరంప్రకర్తవ్యం సంకల్పాదిప్రపూర్వకమ్॥

తా॥ తరువాత ఆట్టివారినే యెనిమిదిమంది బ్రాహ్మణులను ఋత్విక్కులనుగా నియమించవలయును. తరువాత కర్తభార్యా సమేతముగా బ్రాహ్మణులందఱికి మూడామాఱులు ప్రదక్షిణము చేయవలయును. తరువాత నమస్కారముచేసి పరివద్దక్షిణంబిచ్చి సభవారివల్ల అనుజ్ఞ పొందవలయును. తరువాత సంకల్పముచేసి విఘ్నేశ్వరపూజ పుణ్యాహవాచనములు చేయవలయును. తరువాత పంచగవ్యమును పుచ్చుకొనవలయును. తరువాత ఆచార్యునిద్వారా సంకల్పముచేసి తత్తిమ్మాకర్మల నన్నిటినిచేయవలయును. పంచగవ్యములనగా గోవు సంబంధించిన వస్తువులు అయిదు అవి ౧ గోమూత్రము, ౨ గోమయము, 3 గోక్షీరము, ౪ గోదధి, ౫ గోఘృతము.

## పిష్టసర్పాండ రచనాక్రమః.

శ్లో॥ యవతండులమాహృత్య త్రిప్రస్థంతిలసంయుతమ్। ఏలాలవంగకర్పూర చందనైర్గోఘృతైర్యుతమ్ ॥ సంపిష్టిశేనకర్తవ్యం ఫణియుగ్మంయథావిధి। అశీతీశిశవశ్చైవ షష్ట్యుత్తరశతాండకమ్॥ కాలకూటంతథైవైకం వృశ్చికంవృషనక్రకం। స్థూలకూటంచవల్మీక మాహాత్మ్యద్విశతోపరి ॥ చతుశ్చత్వారింశదండం కారయేద్విధివత్తతః। కృత్వా ప్రాణప్రతిష్ఠాంచ పూజయేత్ఫణిసూక్తకైః॥

తా॥ మూడు ఖంచములు యవబియ్యమునున్ను అన్ని నువ్వులనున్ను కలిపి విసరి పిండిచేసి అందులో యాలకాయలు లవంగాలు కర్పూరము గంధమున్ను చూర్ణము చేసి పోసి ఆవునేయిపోసి కలప ముద్దగాచేసి రెండు సర్పములను చేయవలయును. యెనుబది పాముపిల్లలను నూట అరువది అండములను చేయవలయును. ఆపిండితోనే కాలకూటమును విషపిండమును వక తేలును, వక ఆబోతును, వక మసలిని చేయవలయును. తరువాత శిఖరముతో గూడిన పుట్టను చేయవలయును. తరువాత రెండువందల నలభై నాలుగు అండములను జేయవలయును. ఇట్లు బొమ్మలనుజేసి వాటికి ప్రాణప్రతిష్ఠజేసి సర్పసూక్తములతో షోడశోపచార పూజలను చేయవలయును:

## కలశస్థాపనవిధిః.

శ్లో॥ గోమయేనైవసంలిప్య రంగవల్ల్యాద్యలంకృతే। శుచౌదేశేసుపుణ్యాహే సుకృత్వామంటపత్రియమ్॥ అష్టద్రోణస్తథావ్రీహి స్తండులంత్వేతదర్ధకమ్। తదర్ధంతుతిలాన్దద్యా న్మాషంచైవయథాక్రమమ్॥ ఏవంస్థండిలత్రితయంచ కృత్వాతైర్ధాన్యరాశిభిః। తదూర్ధ్వంకమలంలిఖ్య



కర్ణికాలక్షణైర్యుతమ్। తంతునావేష్టితాన్కుంభాం స్థండిలోపరివిన్యసేత్ । శుద్ధోదకేనసంపూర్య రత్నకూర్చాదినిక్షిపేత్॥ ఆమ్రశాఖాం నారికేళ మూర్ధ్వకూర్చంసవస్త్రకం। కర్షత్రయసువర్ణేన రుద్రవిష్ణ్వాహిరూపకాః॥ కృత్వాతుప్రతిమాస్సమ్యక్తత్తత్కుంభోపరిన్యసేత్। శంఖంపద్మంమహాపద్మం గుళికంతక్షకంతథా॥ కార్కోటకంమహానాగం కాలకూటంతథైవచ। ఆవాహ్యసర్పగాయత్ర్యా సర్పసూక్తైర్యథాక్రమమ్। ఏతానష్టమహానాగాన్పూజయేత్కలశోపరి। ఆవాహ్య విధివత్తత్ర రుద్రవిష్ణూయథాక్రమమ్॥

## వేదాదిపారాయణక్రమః.

శ్లో॥ పూజయేద్దక్షిణేకుంభే రుద్రంరుద్రైస్సమంత్రకైః। ఉత్తరేమాధవంకుంభే విష్ణుసూక్తైఃప్రపూజయేత్॥ కుంభంస్పృష్ట్వాజపేత్సర్ప గాయత్రీంచసహస్రకం। నమోఅస్త్వితిసర్పేభ్య ఇత్యష్టశతకం జపేత్ ॥ కుంభంస్పృష్ట్వాజపేద్రుద్ర గాయత్రీంచసహస్రకం। నమకం చమకంచైవ రుద్రసూక్తమతఃపరమ్ ॥ వారుణంబ్రాహ్మసూక్తంచ గోసూక్తంచనృసూక్తకం। పవమానంచభూసూక్తం ఆసురీశాంతమేవచ॥ మహాసౌరంబృహత్సామ సామరాథంతరంతథా। ఏతానిరుద్రసూక్తాని రుద్రకుంభేజపేద్బుధః॥ తతస్స్పృష్ట్వావిష్ణుకుంభం వేదాదీన్విష్ణుసూక్తకం। జపిత్వావిష్ణుగాయత్రీ మష్టోత్తరసహస్రకమ్ ॥ మహానారాయణంచైవ పౌరుషంసూక్తమేవచ। అతోదేవేతిమన్త్రమభిత్వాశ్రీరనోనుమః ॥ శ్రీసూక్తంతుతతఃపశ్చాల్లక్ష్మీసూక్తంతథైవచ। వసుసూక్తంవాలఖిల్య మబ్లింగంవారుణంతథా ॥ ఏతానిసూక్తమంత్రాణి విష్ణుకుంభేజపేద్బుధః॥

తా॥ గోమయముతో భూమిని అలికి పంచరంగులతోను ముగ్గులుపెట్టి శుభదినమందు మూడుమంటపములను రచించవలయును. ఆమంటపములందు యెనిమిది తూములు ధాన్యమును నాలుగు తూములు బియ్యమును రెండు తూములు నువ్వులును వకతూము మినుములును వుంచవలయును. యిట్లు మూడు మంటపములందును ధాన్యరాసులు వుంచి వాటికి మీరబొద్దుతో సహా కమలములను లిఖించవలయును. నూలు దారములు చుట్టిన కలశములను ధాన్యములమీదవుంచి వాటియందు శుద్ధోదకమును రత్నములను

కూర్చలను మామిడి ఆకులనువుంచి కొబ్బరికాయపైనవుంచి వస్త్రములచేత అలంకరించవలయును. మూడు కర్షముల బంగారముచేత శివుని విష్ణువును సర్పమును చేయించి కలశములమీద యుంచవలయును. ఆకలశములందే శంఖ, పద్మ, మహాపద్మ, గుళిక, తక్షక, కర్కోటక, మహానాగ, కాలకూటములను యెనిమిది సర్పములను సర్పగాయత్రిచేత ఆవాహనచేసి పూజించవలయును. తరువాత రుద్రవిష్ణువులనుగూడా ఆవాహన చేయవలయును. దక్షిణ కుంభమందు రుద్రుని రుద్ర మంత్రములతోను ఉత్తరకుంభమందు విష్ణువును విష్ణుసూక్తములతోను పూజించవలయును. తరువాత సర్పకలశమును తాకి సర్పగాయత్రిని వెయ్యి మాఱులు జపించి "నమోఽస్తుసర్పేభ్యః" అను మంత్రమును నూటయెనిమిది మాఱులు జపించవలయును. తరువాత రుద్రకలశమును తాకి రుద్రగాయత్రిని వేయిమాఱులు జపించి నమకమును చమకమును రుద్రసూక్తమును వారుణసూక్తమును బ్రహ్మసూక్తమును గోసూక్తమును పురుషసూక్తమును పవమానసూక్తమును భూసూక్తమును ఆశుశ్శిశానమంత్రమును మహాసౌరమును బృహత్సామమంత్రమును రథంతరసామ మంత్రమును జపించవలయును. తరువాత విష్ణుకలశమును తాకి నారాయణ గాయత్రి వెయ్యిన్ని యెనిమిది మాఱులు జపించి వేదములను విష్ణుసూక్తమును మహానారాయణమును పురుషసూక్తమును అతో దేవా అవంతునః అను అనుమంత్రములను అభిత్వా శ్రీః అనుమంత్రమును శ్రీసూక్తమును లక్ష్మీసూక్తమును వసుసూక్తమును వాలఖిల్యసూక్తమును అబ్లింగమంత్రమును వరుణసూక్తమును పఠించవలయును.

## సర్పశాంతి హోమాదిక్రమః.

శ్లో॥ కుంభానాంపశ్చిమేభాగే అగ్నికుండంసమాచరేత్ । స్వగృహ్యోక్తవిధానేన ముఖాంతం హోమమాచరేత్ ॥ సర్పశ్రీరుద్రవిష్ణూనాం సూక్తైఃపాలాశసంభవైః । సమిద్భిరార్ద్రికైర్హుత్వా అష్టోత్తరసహస్రకమ్ ॥ ఏవమన్నేనచాజ్యేన హుత్వాస్విష్టకృదాదికం। పిష్టసర్పాన్ శిరోహస్తైశ్చైవ పిష్టాండంపురతోన్యసేత్ ॥ కుశైశ్చైవాథ సంస్పృశ్య అసుర్వంతంతథాజపేత్ । పునఃపునస్తాంజప్త్వా నమోఅస్త్విత్యృచంజపేత్ ॥

తా॥ తరువాత కుంభములకు పశ్చిమమున కుండమును త్రవ్వి గృహ్యోక్తవిధిగా అగ్నిముఖాంతమునుచేసి తరువాత సర్పసూక్తములచేతను రుద్రసూక్తములచేతను విష్ణుసూక్తములచేతను ౧౦౦౮ మార్లు పచ్చిపాలాశ సమిధలను చరువును ఆజ్యమును



హోమము చేయవలయును. తరువాత స్విష్టకృద్ధోమమునుచేసి పూర్వము తాను చేసిన పిష్టసర్పములను పిండాములను అగ్నిముందుంచి దర్భలతో తాకుచు అసుర్వంతం అను మంత్రమును నమోఅస్తుసర్పేభ్యః అను మంత్రమును జపించవలయును.

శ్లో॥ ప్రాణాన్క్రమేణసంస్థాప్య చితింకృత్వావిధానతః । చితౌన్య పరివినిక్షిప్య సర్వానండాన్యథాక్రమమ్ ॥ నమోఅస్తుత్రిభిర్మంత్రైః రుద్రసూక్తైస్తురుద్రకైః । మార్జయేత్సర్పగాయత్ర్యా అష్టోత్తరశతైస్తథా॥ హోమాగ్నినాదహేత్పశ్చాత్ ప్రజ్వాల్యాగ్నింహునేత్పునః। మయాపూర్వేభవేనాగా హింసితాయూయమేవహి ॥ తత్రమధ్యంకృపాదృష్ట్యా కురుధ్వంజీవపుత్రకం । గూఢపాద్ధనదాద్దోషా న్మోక్తుమిష్యామ్యహంపునః ॥ దహనాత్సర్వసర్పాణాం మయాజన్మశతార్జితాత్ । ఏతాభ్యాంమనుయుగ్మాభ్యాం హునేదాజ్యేనషోడశ॥

తా॥ తరువాత వాటికి ప్రాణప్రతిష్ఠచేసి కాష్ఠములతో చితిని పేర్చి ఆచితియందు సర్పముల నన్నిటిని వుంచి నమోఅస్తుసర్పేభ్యః అను మూడుమంత్రములతోను రుద్రసూక్తములతోను సర్పగాయత్రితోను నూటయెనిమిది మాఱులు మార్జనచేసి హోమాగ్నిచేత దహనము చేయవలయును. తరువాత అగ్నిని ప్రజ్వరింపజేసి తిరిగి "మయాపూర్వేభవేనాగా హింసితాయూయమేవహి । తత్ర మధ్యంకృపాదృష్ట్యా కురుధ్వంజీవపుత్రకం॥ ౧॥ గూఢపాద్ధనాద్దోషా న్మోక్తుమిష్యామ్యహంపునః । దహనాత్సర్వసర్పాణాం మయాజన్మశతార్జితాత్"॥ ౨॥ అను యీరెండు శ్లోకములచేతను ఆజ్యహోమమును పదహారుమాఱులు చేయవలయును. శ్లోకాభిప్రాయము ఓసర్పములారా నేనుపూర్వజన్మమందు మిమ్ములను చంపితిని మీరుఆతప్పును క్షమించి నాయందు దయయుంచి నాకు దీర్ఘాయుష్మంతుడగు కుమారుడు గలుగునట్లు చేయవలయును. నేను జన్మశతములందు చేసిన సర్పహత్యాదోషమును యిప్పుడు పిష్టసర్పములను దహించి నివారించుకుందును. యీఅర్థములను స్మరించుచు హోమమును చేయవలయును.

శ్లో॥ భస్మీకృత్వాపిష్టసర్పాన్ స్వర్ణ్యాసేనయథావిధి । రుద్రకుంభజలేనైవ సేచయేద్రుద్రసూక్తకైః ॥ తద్భస్మసమ్యగాదాయ మహానద్యాంవినిక్షిపేత్ । స్నాత్వాముహూర్తకాంతత్రైవ స్థిత్వాశుచిసమన్వితః॥ విష్ణుకుంభోదకేనైవ మార్జయేద్వారుణాదిభిః । స[illegible]దభిషేకంస్నాత్వా స్నానావిష్ణుజలేనవై । పునస్స్నాత్వానపత్నీక శ్శుచిర్భూత్వాసమాహితః । ఆచార్యంపూజయిత్వాతు సర్పశాపవిముక్త

యే॥ ప్రతిమాభిస్సవస్త్రాభి రాచార్యః పూజయేద్ధనైః । పయస్వినీంచ గాందద్యా ద్వస్త్రాలంకారసంయుతామ్ ॥ అభ్యర్చ్య బ్రాహ్మణానష్టౌ వస్త్రాలంకారసంయుతం । బ్రాహ్మణాన్భోజయేత్పశ్చా ద్దక్షిణాభ్యంగ పూర్వకమ్ ॥ సర్పశాంతిమవాప్త్వాచ జీవపుత్రంలభేద్ధ్రువం । శ్రీజపా ద్ధననాత్పాపా న్ముచ్యతేనాత్రసంశయః॥

తా॥ తరువాత పిష్టసర్పములను దహించిన భస్మను రుద్రకలశమందున్న జలముతో రుద్రసూక్తములచేత మార్జనచేసి ఆభస్మను తీసుకొనిపోయి మహానదియందుంచవలయును. అప్పుడు స్నానముచేసి ముహూర్తకాలము ధ్యానముతోనుండి విష్ణుకలశోదకముచేత వారుణాది మంత్రములతో మార్జనచేసుకొని తరువాత ఆకలశోదకముచేతనే అభిషేకము చేసుకొని తిరిగి భార్యాసమేతముగా స్నానమాచరించి శుభ్రమైన వస్త్రములను ధరించి సర్పశాపవిముక్తికి ఆచార్యుని వస్త్రాలంకారాదులచేత బూజించి బంగారపు ప్రతిమలను ఆచార్యునకిచ్చి దూడతోగూడిన పాలయావును యిచ్చి సంతృప్తిపరచవలయును. తరువాత యెనిమిదిమంది ఋత్విక్కులను వస్త్రాలంకారాదులచేత పూజించి తరువాత బ్రాహ్మణులకు అభ్యంగస్నానముచేయించి భుజింపచేసి దక్షిణాతాంబూలాదులను సమర్పించవలయును. యిట్లు చేసిన యెడల సర్పములను చంపిన పాపమువలన విముక్తుడై దీర్ఘాయుష్మంతుడగు కుమారుని బొంది అనేక సుఖములనొంది మనుమలు మునిమనుమలు గలిగి పితృరుణవిముక్తుడై అంతమందు శాశ్వతస్వర్గలోక సుఖము నొందును.

మార్జారహననదోష ప్రాయశ్చిత్తవిధిః.

శ్లో॥ మార్జారహననాత్పాపా న్మోక్షణంచబ్రవీమితే । సౌవర్ణరజితై స్తామ్రైః కృత్వామార్జారరూపకమ్ ॥ కలశోపరివిన్యస్య అలంకృత్యాశుభాక్షతైః । కృత్వాప్రాణప్రతిష్ఠాంచ జపేత్తత్సర్పశాంతివత్ ॥ పునఃపూజాంసమాప్యాథ హోమంకృత్వాతిలాక్షతైః । జ్ఞానాజ్ఞానాన్మయాపూర్వం యద్గోప్యందుష్కృతంకృతమ్ ॥ తత్పాపంశమయాశుత్వం స్వజపుత్రంశనైశ్చర । ఏ[illegible]హుత్వామంత్రేణ అష్టోత్తరశతద్వయమ్ ॥ మార్జారప్రతిమాందాస్యే సర్వాపుత్ర మవాప్నుయాత్ । మార్జారప్రతిమాందాస్యే సర్వాఘౌఘనివృత్తయే ॥ దానేనానేనసుప్రీతః పుత్రందేహిశనైశ్చర । ఇతిదత్వాపునస్స్నాత్వా బ్రాహ్మణాన్భోజయేత్సుధీః॥ ఏవంకరోతిచేద్భక్త్యా పుత్రాన్పౌత్రాంశ్చవిందతే।



రహస్యమిదమాఖ్యానం త్వయిస్నేహాన్మయేరితమ్ ॥ గోపనీయం ప్రయత్నేన నప్రకాశ్యంత్వయానఘే॥

తా॥ ఓపార్వతీ వినుము మార్జాలమును చంపిన దోషమునశించుటకుగాను శాంతి చెప్పెదను. బంగారముతోను వెండితోను రాగితోను మార్జాలరూప ప్రతిమలను చేయించి కలశోపరియుంచి అలంకరించి ప్రాణప్రతిష్ఠచేసి సర్పశాంతి యందువలె జపముచేసి పునఃపూజచేసి తిలాక్షతలతో "జ్ఞానాజ్ఞానాన్మయాపూర్వం యద్గోప్యందుష్కృతంకృతం । తత్పాపంశమయాశుత్వం స్వజపుత్రంశనైశ్చర" అను మంత్రముతో రెండు అష్టోత్తరశతములు హోమముచేయవలయును. మంత్రార్థము ఓశనైశ్చరుడా నేను పూర్వజన్మమందు తెలిసియు తెలియకయు రహస్యపాతకమును చేసియున్నాను. ఆపాపమునంతను నశింపజేసి నాకు దీర్ఘాయుష్మంతుడగు కుమారునిమ్ము. తరువాత సమస్తపాపనివృత్తికై మార్జాలప్రతిమను దానము చేయుచున్నాను గనుక ఓశనైశ్చరా నీవీదానముతో సంతోషించి నాకు చిరంజీవి యగు పుత్రునిమ్ము. అను అర్థముగల మార్జారప్రతిమాందాస్యే అను శ్లోకమును పఠించుచు మార్జాలప్రతిమలను దానమివ్వవలయును. తరువాత స్నానముచేసి బ్రాహ్మణసమారాధన చేయవలయును. ఇట్లు చేసిన యెడల పుత్రులను పౌత్రులను పొంది సుఖించును. పార్వతీ యిది రహస్యము నీయందలి స్నేహముచేత చెప్పితిని దీని నితరుల కెవ్వరికిని చెప్పకుము.

ఇతి సంతానరత్నాకరే ద్వాదశపటలస్సమాప్తః.

---

## అథ త్రయోదశపటల ప్రారంభః.

### బ్రహ్మశాపాత్పుత్ర నాశయోగః.

శ్లో॥ అతఃపరంప్రవక్ష్యామి బ్రహ్మశాపస్యలక్షణం ।
పంచమేనవమేజీవే మందయుక్తేః పుగ్గృహే॥
భౌమాత్మజేనసందృష్టే బ్రహ్మశాపాత్సుతక్షయః॥

తా॥ పార్వతీ వినుము తరువాత బ్రహ్మశాప లక్షణమును చెప్పెదను. శని వృషస్థానమందుండి కుజునిచేత చూడబడుచుండగా గురువు పంచమమందుగాని నవమమందుగాని యున్నయెడల బ్రహ్మశాపము వలన సంతాననష్టము గలుగుచుండునని తెలియదగినది.

శ్లో॥ సుతేశేసిచభేకేంద్రే కారకేస్తంగతేగురౌ ।
చంద్రేసూర్యసమాయుక్తే బ్రహ్మశాపాత్సుతక్షయః॥

తా॥ పంచమాధిపతి నీచమందును పుత్రకారకుడు ౧-౪-౭-౧౦ స్థానములందును, గురువు అస్తరాశియందునుండగా చంద్రుడు సూర్యునితో గూడియున్న యడల బ్రహ్మశాపమువలన సంతాననష్టము గలుగుచుండును.

బ్రహ్మశాపాన్నిర్వీర్య గుల్మోదరహృచ్ఛూలాదియోగః.

శ్లో॥ వీర్యస్థానాధిపే భౌమే షష్ఠాష్టవ్యయరాశిగే।
దేహాధిపేనసంయుక్తే నిర్వీర్యంబ్రహ్మశాపతః॥

తా॥ కుజుడు వీర్యస్థానాధిపతియై ౬-౮-౧౨ రాసులలో లగ్నాధిపతితో గూడియున్న యడల బ్రహ్మశాపమువలన వీర్యము చెడిపోవును.

శ్లో॥ వీర్యాధిపేరవౌయస్య తస్యవీర్యంబలంనచ।
శుక్రేణసహితేవాపి వీర్యహీనోభవేన్నరః॥

తా॥ రవి వీర్యస్థానాధిపతియైన యడల శుక్రునితోగూడియున్నను ఆజాతక పురుషునకు బలమును వీర్యపుష్టియు నశించును.

శ్లో॥ దుశ్చిక్యేశేశుభైర్యుక్తే వీర్యేశేరోగసంస్థితే।
రోగేశేతనుభావస్థే గుహ్యరోగాత్సుతక్షయః॥

తా॥ తృతీయాధిపతి శుభుడై తృతీయమందును, వీర్యాధిపతి రోగస్థానమందును, రోగాధిపతి లగ్నమందును వున్న యడల గూఢరోగమువలన సంతాననష్టము గలుగును, వీర్యస్థానమనగా దశమస్థానమని కొందఱును సప్తమమని కొందఱును చెప్పుచున్నారని తా॥

శ్లో॥ మందేలగ్నగతేచంద్రే క్షీణేపాపసమన్వితే।
షష్ఠేరంధ్రగేవాపి రోగంగుల్మోదరంవదేత్॥

తా॥ శని లగ్నమందు నుండగా క్షీణచంద్రుడు పాపగ్రహముతో గూడియుండి షష్ఠాష్టమములందున్న యడల గుల్మోదర రోగము గలిగి సంతాననష్టము గలుగును.

శ్లో॥ లగ్నేశేరాహుసంయుక్తే లగ్నేశేస్తంగతేథవా।
అష్టమేమందసంయుక్తే గుల్మరోగార్దితోనరః॥

తా॥ లగ్నాధిపతి రాహువుతో చేరినను లేక అస్తంగతుడైనను శని అష్టమమందుండిన యడల గుల్మరోగము గలిగి సంతానము గలుగుటకు వీలులేకుండును.

శ్లో॥ మందేనసహితేచంద్రే కుజేనసహితేథవా।
మృగకర్కటజమీనాంశే కుష్ఠరోగాత్సుతక్షయః॥



తా॥ చంద్రుడు శనితోగాని కుజునితోగాని చేరియుండి మకర కటక మేష మీనాంశలలో వున్నయడల కుష్ఠురోగము గలిగి దానిచేత సంతానము నశించును.

శ్లో॥ హిబుకేరాహుసంయుక్తే పాపగ్రహనిరీక్షితే।
లగ్నేశేప్యరినీచస్థే హృచ్ఛూలాద్దేహపీడనమ్॥

తా॥ రాహువు చతుర్థమందుండి పాపదృష్టితోగూడి యుండగా లగ్నాధిపతి శత్రు నీచస్థానములందుండిన యడల హృదయ శూల రోగము గలిగి దానివలన సంతానము గలుగకుండును.

శ్లో॥ పుత్రస్థానాధిపేసూర్యే రోగనాథయుతేరిపౌ।
పాపగ్రహేణసందృష్టే రోగాత్సంపీడ్యతేసుతః॥

తా॥ సూర్యుడు పంచమాధిపతియైయుండి అష్టమాధిపతి షష్ఠమమందుండి పాపగ్రహముచేత చూడబడుచున్న యడల కుమారునకు రోగబాధగలిగియుండును యద్వా సూర్యుడు పంచమాధిపతియై అష్టమాధిపతితోగూడి వ్యయమమందుండి పాపగ్రహదృష్టిగలిగి యుండిన అని అర్థము.

శ్లో॥ సుతస్థానాధిపేచంద్రే క్షయేశేనయుతేవ్యయే।
సూర్యగ్రహేణసందృష్టే స్త్రీదోషాత్సుతనాశనమ్॥

తా॥ చంద్రుడు పుత్రస్థానాధిపతియై అష్టమాధిపతితోగూడి ద్వాదశమందుండి సూర్యునిచేత చూడబడుచుండిన యడల స్త్రీదోషమువలన సంతాననాశము గలుగును.

శ్లో॥ సుతేశేరిపునాథేన సంయుక్తేక్షయరాశిగే।
భౌమేశుభదృశాహీనే నిర్వీర్యాత్పుత్రనాశనమ్।
గర్భస్రావబహుత్వాచ్చ ఉదరేవ్యాధిపీడనమ్॥

తా॥ పంచమాధిపతి షష్ఠాధిపతితోగూడి అష్టమమందుండగా కుజుడు శుభగ్రహ దృష్టిలేనివాడై యుండిన యడల వీర్యమందు బలములేక సంతానము గలుగదు. అనేక గర్భములు స్రవించిపోవును. అందువలన భార్యకు హృదయమందు వ్యాధిగూడా జనించును.

శ్లో॥ సుతస్థానాధిపేసౌమ్యే జ్ఞాతిస్థేపాపసంయుతే।
యుగ్మమాసాత్పరంప్రాప్య త్రిసప్తమాసాత్స్రవిష్యతి॥

తా॥ బుధుడు పంచమాధిపతియై పాపగ్రహముతోగూడి షష్ఠస్థానమందున్న యడల భార్యాగర్భము రెండుమాసములకు మీద యేడుమాసములకులోపల నశించును.

శ్లో॥ పుత్రస్థానాధిపే జీవే రిపునాథయుతేఽపివా ।
మందదృష్టియుతే స్రావం గర్భపిండస్య పాతనమ్॥

తా॥ బృహస్పతి పంచమాధిపతియై షష్ఠాధిపతితోఁగూడి షష్ఠమమందుండి శని చేత చూడబడుచుండిన యడల గర్భము స్రవించిపోవును లేక పాతమైనా అగును.

శ్లో॥ సుతస్థానాధిపే శుక్రే షష్ఠే శేనయుతేక్షితే ।
మాహేయదృష్టిసంయుక్తే రోగాద్గర్భవినాశనమ్॥

తా॥ శుక్రుడు పంచమాధిపతియై షష్ఠాధిపతితోఁగూడి యుండి లేక చూడబడి యుండి కుజునిచేత చూడబడుచున్న యడల రోగము వలన గర్భము చెడిపోవును.

శ్లో॥ పుత్రస్థానాధిపే మందే సూర్యభౌమయుతేఽపివా ।
దృష్టియుక్తే థవాగర్భ నాశనంచభవిష్యతి॥

తా॥ శని పంచమాధిపతియై షష్ఠస్థానమందు రవ్యంగారకులతోఁ గూడిగాని చూడబడిగాని యున్నయడల గర్భనాశనము గలుగును.

శ్లో॥ చరస్థిరోభయేలగ్నా ల్లాభధర్మార్థకాః క్రమాత్ ।
త్రయాణాం కేంద్రసంస్థైశ్చ గ్రహైర్బాధాభవిష్యతి॥

తా॥ ఏకాదశ నవమ ద్వితీయ స్థానములు క్రమముగా చరస్థిర ద్విస్వభావము లయి వుండి వాటికి కేంద్రములందు గ్రహములున్నయడల గ్రహబాధవల్ల గర్భము నశించును.

గ్రహభేదాద్దేవతా రోగాదిభేదాః.

శ్లో॥ బాధాస్థానంగతేసూర్యే శివభూతాదిపీడనం । చంద్రేదుర్గాకృతంరోగం ధర్మదైవతపీడనమ్॥ భౌమేస్కందకృతంరోగం పుత్రనాశకరంభవేత్ । సౌమ్యేగంధర్వయక్షాది విమానస్థానవాసిభిః ॥ భూతావేశాద్గర్భనాశో భవిష్యతిసుతక్షయః । జీవేబ్రాహ్మణశాపాచ్చ దేవానామపికోపనాత్ ॥ శుక్రేకేతుయక్షకృతంరోగం బ్రహ్మరాక్షసపీడనం॥ మందేచభూతనాథానాం శైవానాంచాపిపీడనమ్ ॥ రాహౌసర్పకృతం రోగం కేతౌచండాలపీడనం । మాంద్యాప్రేతకృతంరోగ గర్భనాశకరంభువి॥

తా॥ సూర్యుడు అష్టమమందున్న యడల శివభూత పీడవలన గర్భము నశించును. చంద్రుడు అష్టమమందున్న యడల దుర్గాధర్మ దేవతల పీడవలన గర్భమునశించును



కుజుడు అష్టమమందున్న యడల సుబ్రహ్మణ్య దేవత వలన గర్భము నశించును. బుధుడు అష్టమమందున్నయడల గంధర్వయక్షాదివిమాన దేవతల వలన గర్భమునశించును. బృహస్పతి అష్టమమందున్నయడల దేవబ్రాహ్మణ శాపముల వలన గర్భమునశించును. శుక్రుడు అష్టమమందున్నయడల యక్షబ్రహ్మరాక్షస పీడ వలన గర్భమునశించును. శని అష్టమమందున్న యడల శివభూతగణములచేత గర్భము నశించును. రాహువు అష్టమమందున్న యడల సర్ప బాధచేత గర్భమునశించును. కేతువు అష్టమమందున్న యడల చండాల గ్రహముల వలన గర్భమునశించును. మాందిగ్రహము అష్టమమందున్నయడల ప్రేత గ్రహములచేత గర్భము నశించును.

శ్లో॥ ఏతేదేవిమహాదోషాః పుత్రక్షయకరాఇమే ।
ఇతిజ్ఞాత్వాతుతచ్ఛాంతిః కృతాచేత్పుత్రసంభవః।
భవిష్యతినసందేహో రహస్యంప్రబ్రవీమితే।
గోపనీయంప్రయత్నేన గిరిజేసుతవృద్ధిదమ్॥

తా॥ ఓ పార్వతీ యీదోషములు సంతాన నాశనకరములు వీటిని తెలుసికొని శాంతిచేసినయడల సంతానము స్థిరమైయుండును. యిది చాలా రహస్యము విన్నవారికి సంతానప్రదము.

శ్లో॥ ఇతిశ్రుత్వాశుభంవాక్యం ప్రణమ్యశిరసాశివం ।
పునఃప్రోవాచభక్త్యాసా శంకరంలోకశంకరమ్ ।
పూర్వోక్తగ్రహదోషాణాం నిర్వృతింవదమేప్రభో ।
రవిదోషనివృత్త్యర్థం శివపూజాక్రమంవద॥

తా॥ ఇట్లు శంకరుడు చెప్పినమాటను విని పార్వతీదేవి నమస్కారముచేసి వినయముతో నిట్లనియె. శంకరా పైన చెప్పిన దోషములకు శాంతిని చెప్పుము రవ్యాది దోషములకు శాంతికరములైన శివపూజాదులను చెప్పుము.

రవిదోష నివారక శివపూజాప్రకారః.

శ్లో॥ మాఘమాసేసితేపక్షే రాద్రభేసోమవాసరే। పూజయేచ్ఛతరుద్రైశ్చ స్ఫాటికంలింగముత్తమమ్ । లింగదానంచయఃకుర్యాత్స

పుత్రశ్శతవార్షికం । లబ్ధ్వాసుఖమవాప్నోతి మోదతేపుత్రసంపదా॥
రవిదోషనివృత్తిశ్చ భవిష్యతినసంశయః॥

తా॥ ఆమాట విని శివుఁడు తిరిగిచెప్పుచున్నాఁడు, మాఘశుక్లమందు ఆర్ద్రానక్షత్రయుక్త సోమవారమందు శివునిస్ఫటికలింగమందు పూజించి నమకముతో అభిషేకమునుచేసి లింగదానమును చేసిన యెడల నూఱుసంవత్సరములు జీవించియుండు కుమారుఁడుగలిగిఅమిత సుఖమొందును. యిది రవిదోష నివారకము.

చంద్రదోషనివారక దుర్గాపూజా.

శ్లో॥ శశిదోషనివృత్యర్థం దుర్గాదేవీంప్రపూజయేత్ ।

తా॥ చంద్రదోషనివృత్తికై దుర్గాపూజను చేయవలయును.

కుజదోషనివారక సుబ్రహ్మణ్యపూజాతన్మంత్రజపశ్చ.

శ్లో॥ యదిభౌమకృతందోషం సుబ్రహ్మణ్యస్యపూజనాత్ ।
తన్మంత్రదశసాహస్ర జపాన్నశ్యతితత్క్షణాత్ ॥

తా॥ కుజదోష నివృత్తికై సుబ్రహ్మణ్య మంత్రమును పదివేలు జపించి సుబ్రహ్మణ్యదేవుని పూజించవలయును.

బుధశాప నివారక విష్ణుప్రీతికర యాగసాల గ్రామదానే.

శ్లో॥ విష్ణునాసంభవస్యాస్య దోషస్యశమనంమఖాత్ ।
సాలగ్రామశిలాదానా త్పుత్రంలబ్ధ్వాసమోదతే॥

తా॥ బుధదోషనివృత్తికై యజ్ఞమునుచేసి సాలగ్రామశిలా దాన మాచరించవలయును.

గురుశాపనివారక బ్రాహ్మణోపనయనాదికథనం.

శ్లో॥ గురుశాపస్యదోషస్య ప్రాయశ్చిత్తంహితంశృణు ।
ద్విజపుత్రందరిద్రంహి ప్రతిష్ఠాంతుకరోతిచేత్ ।
సుపుత్రంపౌత్రసంయుక్తం లబ్ధ్వాతుభువిమోదతే॥

తా॥ గురుదోష నివృత్తికై దరిద్రుఁడైన బ్రాహ్మణ కుమారుని తెచ్చి ఉపనయన వివాహములను చేయించి గృహక్షేత్రముల నిచ్చి యుంచవలయును. అట్లుచేసిన యడల పుత్రపౌత్రాది యుతముగా సుఖానయుండును.

శుక్రదోషనివారక సేతుస్నాన త్రిశతిషోడశజపాది.



శ్లో॥ శుక్రసంగతదోషస్య ప్రాయశ్చిత్తముదాహృతం ।
సేతుస్నానంచకర్తవ్య మథవాత్రిశతింజపేత్ ॥
మంత్రంజపేత్షోడశీంవా దశసాహస్రసంఖ్యయా ।
దుర్గాపూజాంకృతేసద్యః సుపుత్రంలభతేధ్రువమ్॥

తా॥ శుక్రదోషనివృత్తికై సేతు స్నానముచేసి దేవీ త్రింశతీ మంత్రమునుగాని షోడశీమంత్రమునుగాని పదివేలుజపించి దుర్గాపూజ చేయవలయును. అట్లుచేసిన యడల దీర్ఘాయుష్యముగల పుత్రుఁడు గలుగును.

శనిదోష నివారక శివలింగ ప్రతిష్ఠ.

శ్లో॥ శనిశాపస్యదోషస్య ప్రాయశ్చిత్తంహితంశృణు ।
శివలింగప్రతిష్ఠాంచ వంశవృద్ధికరంశుభమ్॥

తా॥ శనిదోషనివృత్తికై శివలింగప్రతిష్ఠను జేయవలెను మఱియు నిత్యము శివపూజనాచరించి ప్రదోషకాలంబున దంపతీ సహితముగా దీపారాధనముచేసి ప్రదక్షిణమాచరించి శనిప్రీతికరములైన తిలదానములనుగూడ చేయవలయునని మరికొందఱు చెప్పియున్నారు వంశవృద్ధికరమని తా॥

అన్యదోషాణాం తదుక్తశాంతిః.

శ్లో॥ జ్ఞాత్వైవమన్యదోషాణాం తత్తచ్ఛాంతింసమాచరేత్ ।
నశ్యంతిసకలాన్ దోషాన్ సుపుత్రంలభతేధ్రువమ్॥

తా॥ ఇట్లుగానే అన్యదోషములకు శాంతిని తెలిసికొని చేయవలయును. అట్లుచేసిన యడల సకలదోషములు నశించి పుత్రులు గలుగుదురు, యిది నిశ్చయము.

ఇతి సంతాన రత్నాకరే త్రయోదశ పటల స్సమాప్తః.

అథ చతుర్దశ పటల ప్రారంభః.

శ్లో॥ దేవదేవజగన్నాథ శూలపాణెవృషధ్వజ। కేనయోగేనమర్త్యానాం జాయతెశిశునాశనం ॥ తత్సర్వమత్రయోగేన బ్రూహిమేశశిశేఖర । శాపమోక్షంచకృపయా ప్రాణినామల్పమేధసామ్॥

తా॥ పూర్వకాలమందు కైలాసపర్వతమందు సింహాసనాసీను

లైయున్న సమయమున ఒకప్పుడు పార్వతీదేవి పరమేశ్వరునకు నమస్కరించి యిట్లనియె. ఓశంకరా దేవదేవా శూలపాణీ వృషభవాహనా, వృషభధ్వజా, మనుష్యులకు యేయోగముచేత సంతాననష్టము గలుగును, అల్పబుద్ధి, అల్పశక్తి గల మనుష్యులకు సంతాననష్టకారణములైన శాపములునశించు యుపాయములెవ్వి. యావిషయమునంతయును నాయందు దయయుంచి చెప్పుము.

శంకరఉవాచ॥ శ్లో॥ సాధుపృష్టంత్వయాదేవి కథయామిసవిస్తరాత్ । శ్రుణుష్వైకమానాభూత్వా బలాబలవశాదపి॥ జ్ఞేయంసునిశ్చితంసర్వం రాశిచక్రివిశేషతః । మేషాదిమీనపర్యంతం మూర్త్యాదిద్వాదశక్రిమాత్॥ భావంచభావజంజ్ఞాత్వా ఫలంబ్రూయాద్విచక్షణః । తనుర్విత్తంబంధుమాతృ పుత్రిశత్రుస్మరోమృతిః । ధర్మంకర్మచలాభంచ వ్యయాంతాభావసంజ్ఞికాః॥

తా॥ ఆమాట విని శివుఁడు చెప్పుచున్నాడు పార్వతీ నీవడిగిన ప్రశ్న లోకోపకారము కొఱకు గాన చాలా బాగున్నది సవిస్తరముగా చెప్పెదను సావధానముగా వినుము. మేషము మొదలు మీనము వఱకుగల పన్నెండు రాసులందుండు గ్రహములయొక్క బలాబలములనుబట్టి యీవిషయమంతయు తెలియబడియున్నది, భావములు ౧ తనుభావము, ౨ ధనభావము, ౩ సోదరభావము, ౪ మాతృభావము, ౫ పుత్రభావము, ౬ శత్రుభావము, ౭ కళత్రిభావము, ౮ రోగభావము. ౯ ధర్మభావము, ౧౦ కర్మభావము, ౧౧ లాభభావము, ౧౨ వ్యయభావము యిట్లు పన్నెండు కనుక యీభావములందుండు గ్రిహములనుబట్టి ఫలమును చూచుకునేది, పైన చెప్పినరాశి సంఖ్య మేషాదినిబట్టి చూచుకొనవలయును, యీభావసంఖ్య జన్మలగ్నమునుబట్టి చూచుకొనవలయును.

శ్లో॥ గురులగ్నేశదారేశ పుత్రిస్థానాధిపేషుచ ।
సర్వేషుబలహీనేషు వక్తవ్యాత్వనపత్యతా॥

తా॥ గురువు లగ్నాధిపతి సప్తమాధిపతి పుత్రస్థానాధిపతి యీనలుగురు బలములేనివారై యుండిన యడల సంతానము గలుగదని చెప్పవలయును.



శ్లో॥ రవ్యాదరాహుశనియః పుత్రస్థాబలసంయుతాః।
కారకాద్యాఃక్షీణబలా అనపత్యత్వమాదిశేత్॥

తా॥ సూర్యుడు, అంగారకుడు, రాహువు, శని, వీరు పుత్రిస్థానమందుండి బలవంతులైయుండి పుత్రకారకుడు పుత్రిస్థానాధిపతి బలములేనివారై యున్న యడల సంతానము గలుగదు.

సర్పశాపమున పుత్రినష్టము.

శ్లో॥ పుత్రస్థానంగతేరాహౌ కుజేనాపినిరీక్షితే ।
కుజక్షేత్రగతేవాపి సర్పశాపాత్సుతక్షయః॥

తా॥ రాహువు పుత్రిస్థానమందుండి అంగారకునిచేత చూడబడుచున్నను రాహువున్నది కుజక్షేత్రమైనను సర్పశాపమువలన సంతాన నష్టము గలుగును.

శ్లో॥ పుత్రేశేరాహుసంయుక్తే పుత్రిస్థేభానునందనే ।
చంద్రదృష్టియుతేవాపి సర్పశాపాత్సుతక్షయః॥

తా॥ పుత్రాధిపతి రాహుతోగూడి యుండగా శని పంచమమందుండి చంద్రదృష్టి గలిగియుండినగాని చంద్రునితో గూడినగాని సర్పశాపము వల్ల సంతాన నష్టము గలుగును.

శ్లో॥ కారకేరాహుసంయుక్తే పుత్రేశేబలవర్జితే ।
విలగ్నేశేభౌమయుతే సర్పశాపాత్సుతక్షయః॥

తా॥ పుత్రికారకుడు రాహువుతోగూడియున్నను, పుత్రిస్థానాధిపతి బలశూన్యుడును అయివుండగా లగ్నాధిపతి కుజునితోగూడియుండెనేని సర్పశాపమువలన సంతాన నష్టము గలుగును.

శ్లో॥ కారకేభౌమసంయుక్తే లగ్నేశేరాహుసంయుతే ।
పుత్రిస్థానేశ్వరేదుస్థే సర్పశాపాత్సుతక్షయః॥

తా॥ పుత్రకారకుడు అంగారకునితో గూడియుండి లగ్నాధిపతి రాహువుతోగూడియుండగా పుత్రిస్థానాధిపతి షష్టాష్టమ ద్వాదశములందుగాని అస్తంగతుడుగాని అయివుండిన యడల సర్పశాపము వలన సంతాన నష్టము.

శ్లో॥ భౌమాంశేభౌమసంయుక్తే పుత్రేశేసోమనందనే ।
రాహుమాందియుతేలగ్నే సర్పశాపాత్సుతక్షయః॥

తా॥ బుధుడు పుత్రస్థానాధిపతియై అంగారకునితో గూడిగాని అంగారకాంశయందుగాని యుండగా లగ్నమందు రాహు గుళికులుండిన యెడల సర్పశాపమున సంతాన నష్టము గలుగును.

శ్లో॥ పుత్రస్థానే కుజక్షేత్రే పుత్రే రాహుసమన్వితే।
సౌమ్యదృష్టియుతేవాపి సర్పశాపాత్సుతక్షయః॥

తా॥ పుత్రస్థానము కుజక్షేత్రమై రాహువుతోగాని బుధునితోగాని గూడియున్నను చూడబడియున్నను సర్పశాపమువలన సంతాన నష్టము గలుగును.

శ్లో॥ పుత్రస్థా భానుమందారాః స్వర్భానుశ్శశిజేంగిరాః।
నిర్బలౌ పుత్రలగ్నేశౌ సర్పశాపాత్సుతక్షయః॥

తా॥ పుత్రస్థానమందు సూర్య శని కుజ రాహు బుధ గురువులుండగా పుత్రస్థానాధిపతియు లగ్నాధిపతియు బలహీనులై యుండిన యెడల సర్పశాపమువలన సంతాన నష్టము గలుగును.

శ్లో॥ లగ్నేశే రాహుసంయుక్తే పుత్రేశే భౌమసంయుతే।
కారకే రాహుసందృష్టే సర్పశాపాత్సుతక్షయః॥

తా॥ లగ్నాధిపతి రాహువుతోను పుత్రాధిపతి కుజునితోను గూడియుండగా పుత్రకారకుడు రాహువుచేత చూడబడుచుండెనేని సర్పశాపము వలన సంతాన నష్టము గలుగును.

శ్లో॥ తద్దోషపరిహారార్థం నాగపూజాం సమారభేత్। స్వగృహ్యోక్తవిధానేన ప్రతిష్ఠాం కారయేత్సుధీః॥ నాగమూర్తిం సువర్ణేన కృత్వా పూజాం సమారభేత్। గోభూతిలహిరణ్యాది దద్యాద్విత్తానుసారతః॥ ఏవంకృతే తు నాగేంద్ర ప్రసాదాద్వర్ధతే కులం॥

తా॥ ఆ సర్పదోష పరిహారమునకు బంగారముతో సర్పమును చేయించి యథాశక్తిగా గోదాన భూదాన తిలదాన సువర్ణదానములను చేసి స్వశాఖీయ సూత్రప్రకారముగా నాగప్రతిష్ఠ చేసిన యెడల నాగేంద్రుడు ప్రసన్నుడగును. అట్లు జరిగిన యెడల గాన వంశము వృద్ధినొందును.

పితృశాపమువల్ల సంతాన నష్టము.

శ్లో॥ పితృస్థానంగతే భానౌ నీచే మందాంశకస్థితే।



పార్శ్వయోః క్రూరసంబంధే పితృశాపాత్సుతక్షయః॥

తా॥ సూర్యుడు నవమస్థానమందు నీచాంశయందుగాని మకర కుంభాంశలందుగాని యుండి పాపగ్రహ మధ్యగతుడై యున్న యెడల పితృశాపము వలన పుత్రనష్టము గలుగును.

శ్లో॥ పుత్రస్థానాధిపే భానౌ త్రికోణే పాపసంయుతే।
క్రూరాంతరే పాపదృష్టే పితృశాపాత్సుతక్షయః॥

తా॥ సూర్యుడు పుత్రస్థానాధిపతియై పంచమ నవమస్థానములందుండి పాపగ్రహములతో గూడిగాని పాపమధ్యనుండిగాని పాపదృష్టిగలిగిగాని యున్న యెడల పితృశాపమువల్ల పుత్రనష్టముగల్గును.

శ్లో॥ భానురాశిస్థితే జీవే పుత్రేశే భానుసంయుతే।
పుత్రే లగ్నే పాపయుతే పితృశాపాత్సుతక్షయః॥

తా॥ బృహస్పతి సూర్యరాశియందుండి పంచమాధిపతి సూర్యునితో గూడియుండగా పంచమస్థానమందును లగ్నమందును పాపగ్రహములుండిన యెడల పితృశాపమువల్ల పుత్రనష్టముగలుగును.

శ్లో॥ లగ్నేశే దుర్బలే పుత్రే పుత్రేశే భానుసంయుతే।
పుత్రే లగ్నే పాపయుతే పితృశాపాత్సుతక్షయః॥

తా॥ లగ్నాధిపతి బలములేనివాడై పంచమమందుండగా పంచమాధిపతి సూర్యునితో గూడి యుండగా పుత్రస్థానమందును లగ్నమందును పాపగ్రహములున్న యెడల పితృశాపమువలన పుత్రనష్టము గలుగును.

శ్లో॥ పితృస్థానాధిపే పుత్రే పుత్రేశే వాథ సంస్థితే।
లగ్నే పుత్రే పాపయుతే పితృశాపాత్సుతక్షయః॥

తా॥ పితృస్థానాధిపతి పంచమమందును పంచమాధిపతి పితృస్థానమందును వుండగా లగ్నము పుత్రస్థానము పాపగ్రహములతో గూడి యుండిన యెడల పితృశాపమువలన పుత్రనష్టము గలుగును.

శ్లో॥ పితృస్థానాధిపే భౌమః పుత్రేశేన సమన్వితః। లగ్నే పుత్రే పితృస్థానే పాపాత్సంతతినాశనం॥

తా॥ అంగారకుడు పితృస్థానాధిపతియై పంచమాధిపతితో గూడి యుండగా లగ్నమందును పుత్రస్థానమందును పితృస్థానమందు

ను పాపగ్రహము లున్నయడల పితృశాపమువలన పుత్రనష్టము గలుగును.

శ్లో॥ పితృస్థానాధిపే దుస్థే కారకే పాపరాశిగే ।
పుత్రే లగ్నేశ్వరే పాపే పితృశాపాత్సుతక్షయః ॥

తా॥ పితృస్థానాధిపతి షష్ఠాష్టమ ద్వాదశనీచలయందును పుత్రకారకుడు పాపరాశియందునుండగా పుత్రస్థానమును లగ్నాధిపతియును పాపగ్రహములతో గూడియుండిన యడల పితృశాపమువలనపుత్రనష్టము గలుగును.

శ్లో॥ లగ్నపంచమభావస్థా భానుభౌమశనైశ్చరాః ।
రంధ్రే రిఃఫే రాహుజీవౌ పితృశాపాత్సుతక్షయః ॥

తా॥ రవి కుజ శనులు లగ్నపంచమస్థానములందుండగా అష్టమమందు రాహువును ద్వాదశమందు బృహస్పతియు నుండిన యడల పితృశాపము వలన పుత్రనష్టము గలుగును.

శ్లో॥ లగ్నాదష్టమగే భానౌ పుత్రస్థే భానునందనే ।
పుత్రేశే రాహుసంయుక్తే లగ్నే పాపే సుతక్షయః ॥

తా॥ సూర్యుడు అష్టమమందును శనిపంచమ మందును పంచమాధిపతి రాహువుతోను వుండగా లగ్నమందు పాపగ్రహమున్న యడల పితృశాపమువలన పుత్రనష్టము గలుగును.

శ్లో॥ వ్యయేశే లగ్నభావస్థే రంధ్రేశే పుత్రరాశిగే ।
పితృస్థానాధిపే రంధ్రే పితృశాపాత్సుతక్షయః ॥

తా॥ ద్వాదశాధిపతి లగ్నమందును, అష్టమాధిపతి పంచమమందును, నవమాధిపతి అష్టమ మందును వుండిన యడల పితృశాపము వలన పుత్రనష్టము గలుగును.

శ్లో॥ రోగేశే పుత్రభావస్థే పితృస్థానాధిపే తథా ।
కారకే రాహుసంయుక్తే పితృశాపాత్సుతక్షయః ॥

తా॥ అష్టమాధిపతియు నవమాధిపతియు పంచమ మందుండగా పుత్రకారకుడు రాహువుతోగూడియున్న యడల పితృశాపము వలన పుత్రనష్టము గలుగునని తెలిసికొనవలయును.



శ్లో॥ తద్దోషపరిహారార్థం గయాశ్రాద్ధంచ కారయేత్ । బ్రాహ్మణాన్ భోజయేత్తత్ర అయుతం వా సహస్రకం ॥ కన్యాదానం తతః కృత్వా గాంచ దద్యాత్సవత్సకాం । ఏవం కృతే పితృశాపా న్ముచ్యతే నాత్ర సంశయః ॥ వర్ధతే చ కులం తస్య పుత్రపౌత్రాదిభిస్తథా । దృష్టియోగపదైస్సర్వం ఫలం బ్రూయాద్విచక్షణః ॥

తా॥ ఆపితృశాప దోషనివృత్తికై గయాశ్రాద్ధముచేసి అచ్చట పదివేలమందికిగాని సహస్రమందికిగాని బ్రాహ్మణులకు భోజనము పెట్టి తరువాత కన్యాదాన గోదానములను చేయవలయును, యిట్లు చేసిన యడల పితృశాపము నశించి పుత్రులుపౌత్రులు గలిగి వంశము వృద్ధినొందును. యీపితృశాపమును జ్యోతిష్కుడు పైనచెప్పిన రీతిని గ్రహస్థితినిబట్టియు దృష్టినిబట్టియు చూచి చెప్పవలయును.

## మాతృశాపమువలన సంతాననష్టము.

శ్లో॥ మాతృస్థానాధిపే చంద్రే నీచే వా పాపమధ్యగే ।
హిబుకే పంచమే పాపే మాతృశాపాత్సుతక్షయః ॥

తా॥ చంద్రుడు చతుర్థాధిపతియై నీచయందుగాని పాపమధ్యనుగాని యుండగా చతుర్థ పంచమములందు పాపగ్రహములున్న యడల మాతృశాపమువలన సంతాననష్టము గలుగును.

శ్లో॥ లాభే మందసమాయోగే మాతృస్థానే శుభేతరే ।
నీచే పంచమగే చంద్రే మాతృశాపాత్సుతక్షయః ॥

తా॥ ఏకాదశమందు శనియును చతుర్థమందు పాపగ్రహము లుండగా చంద్రుడు నీచయందుగాని పంచమమందుగాని యున్నయడల మాతృశాపము వలనసంతాన నష్టముగలుగును.

శ్లో॥ పుత్రస్థానాధిపే దుస్థే లగ్నేశే నీచరాశిగే ।
చంద్రపాపసమాయోగే మాతృశాపాత్సుతక్షయః ॥

తా॥ పంచమాధిపతి షష్ఠాష్టమద్వాదశ నీచలందును లగ్నాధిపతినీచయందు నుండగాచంద్రుడు పాపగ్రహముతో గూడిన యడల మాతృశాపమువలన సంతాననష్టము గలుగును,

శ్లో॥ పుత్రస్థానాధిపే దుస్థే చంద్రే పాపాంశసంయుతే ।
లగ్నే పుత్రే పాపయుతే మాతృశాపాత్సుతక్షయః ॥

తా॥ పంచమాధిపతి ౬-౮-౧౨ స్థానములందుండగా చంద్రుడు పాపనవాంశను పొందియుండగా లగ్నమందును పంచమమందును పాపగ్రహములున్న యడల తల్లి శాపమువలన తనయనాశనమగును

శ్లో॥ పుత్రస్థానాధిపే చంద్రే మందరాహ్వారసంయుతే।
భాగ్యేవా పుత్రరాశౌవా కారకే పుత్రనాశనం॥

తా॥ చంద్రుడు పుత్రస్థానాధిపతియై శనిరాహ్వంగారకుల తోగూడియుండగా పుత్రకారకుడగు బృహస్పతి నవమమందుగాని పంచమమందుగాని వున్నయెడల తల్లిశాపమువలన తనయనాశనమగును.

శ్లో॥ మాతృస్థానాధిపే భౌమే శనిరాహుసమన్వితే।
భానుచంద్రయుతే పుత్రే తస్యసంతతినాశనం॥

తా॥ అంగారకుడు చతుర్థస్థానాధిపతియై శనిరాహువుల తోగూడియుండగా పంచమమందును లగ్నమందును క్రమముగా సూర్యచంద్రులున్న యడల తల్లిశాపమువలన తనయనాశనము గలుగును

శ్లో॥ లగ్నాత్మజేశౌ శత్రుస్థౌ రంధ్రే మంత్రాధిపే స్థితే।
పితృనాశాధిపౌ లగ్నే మాతృశాపాత్సుతక్షయః॥

తా॥ లగ్నపంచమాధిపతులు శత్రుస్థానమందుండి అందు పంచమాధిపతి అష్టమమందుండగా అష్టమనవమాధిపతులు లగ్నమందుండినయడల తల్లిశాపము వలనతనయ నాశనముగలుగును.

శ్లో॥ షష్ఠాష్టమేశౌ లగ్నస్థౌ వ్యయే మంత్రాధిపే స్థితే।
చంద్రే జీవే పాపయుతే మాతృశాపాత్సుతక్షయః॥

తా॥ షష్ఠాష్టమాధిపతులు లగ్నమందును పంచమాధిపతి ద్వాదశమందును చంద్రుడు పంచమమందును వుండగా గురువు పాపగ్రహముతో గూడియున్నయడల తల్లిశాపము తనయనాశనముగల్గును.

శ్లో॥ పాపమధ్యగతే లగ్నే క్షీణే చంద్రే చ సప్తమే।
మాతృపుత్రే రాహుమందౌ మాతృశాపాత్సుతక్షయః॥

తా॥ లగ్నము పాపగ్రహ మధ్యనున్న క్షీణచంద్రుడు సప్తమమందును చతుర్థమందు రాహువును, పంచమమందు శనియును వున్నయడల తల్లిశాపము వలన తనయనాశనమగును.



శ్లో॥ నాశస్థానాధిపే పుత్రే పుత్రేశే నాశరాశిగే।
చంద్రమాతృపతౌ దుస్థే మాతృశాపాత్సుతక్షయః॥

తా॥ అష్టమాధిపతి పంచమమందును పంచమాధిపతి అష్టమమందును వుండగా చంద్రచతుర్థాధిపతులు ౬-౮-౧౨ స్థానములందుండినయడల తల్లిశాపమువలన తనయ నాశనముగల్గును

శ్లో॥ చంద్రక్షేత్రే యదా లగ్నే కుజరాహుసమన్వితే।
చంద్రమందౌ పుత్రసంస్థౌ మాతృశాపాత్సుతక్షయః॥

తా॥ కర్కాటకము లగ్నమైఅందు కుజ రాహువులుండగా చంద్రశనులు పంచమమందుండిన యడలతల్లిశాపము వలనతనయనాశనముగలుగును.

శ్లో॥ లగ్నే పుత్రే రంధ్రే రిఃఫే ఆరో రాహుర్రవిశ్శనిః।
మాతృలగ్నాధిపౌ దుస్థౌ మాతృశాపాత్సుతక్షయః॥

తా॥ లగ్నమందు అంగారకుడును పంచమమందు రాహువును అష్టమమందు రవియును ద్వాదశమందు శనియునువుండగా చతుర్థలగ్నాధిపతులు ౬-౮-౧౨ స్థానములందున్నయడల తల్లిశాపము వలనతనయ నాశనముగలుగును.

శ్లో॥ నాశస్థానంగతే జీవే కుజరాహుసమన్వితే।
పుత్రస్థానే మందచంద్రౌ మాతృశాపాత్సుతక్షయః॥

తా॥ బృహస్పతి అష్టమమందుండి కుజరాహువులతో గూడియుండగా శనిచంద్రులు పుత్రస్థానమందుండిన యడలతల్లిశాపము వలనతనయ నాశనముగలుగును.

శ్లో॥ గ్రహయోగవశైస్సర్వం ఫలంబ్రూయాద్విచక్షణః।
శుభసౌఖ్యం విసర్గిమం మిశ్రే మిశ్రం ప్రకీర్తితం॥

తా॥ జ్యోతిష్కులు పైనచెప్పినరీతిని జాతకమందుండు గ్రహములస్థితిని విచారించి ఫలమును చెప్పవలయును అందుశుభాధిక్యముంటె శుభఫలమునున్ను శుభాశుభ మిశ్రముగా నుంటె మిశ్రఫలమును న్ను చెప్పవలయును.

శ్లో॥ సేతుస్నానం ప్రకుర్వీత గాయత్రీలక్షసంఖ్యకం।
గ్రహదానం చ కర్తవ్యం కాంస్యపాత్రేపయస్థితి॥

బ్రాహ్మణాన్ భోజయేత్పశ్చా దశ్వత్థస్య ప్రదక్షిణం।
కర్తవ్యంభక్తియుక్తేన చాష్టవింశత్సహస్రకం॥

తా॥ ఈ మాతృశాప పరిహారమునకు గాను రామేశ్వరము పోయి సేతువులో స్నానమాచరించి లక్షగాయత్రి జపముచేసి నవగ్రహములకు దానములుచేసి వెండిపాత్రలో పాలుపోసి బ్రాహ్మణునకు దానముచేసి అశ్వత్థమునకు యిరువదియెనిమిదివేలు ప్రదక్షిణములు చేసిపిమ్మట బ్రాహ్మణసమారాధన చేయవలెను.

శ్లో॥ ఏవంకృతేయదాదేవి శాపాన్మోక్షోభవిష్యతి।
సత్పుత్రంలభతేపశ్చా ద్వృద్ధిస్స్యాత్తత్తస్యసంతతేః॥

తా॥ పార్వతి యీ ప్రకారముగా చేసినయడల మాతృశాపమునుంచి తొలగి మంచికుమారుడుగల్గి తరువాత మనుమలు మునిమనుమలుగల్గి సుఖించును

బ్రాతృశాపమువలన పుత్రనష్టము,

శ్లో॥ అతఃపరంప్రవక్ష్యామి భ్రాత్రాదాశాపకారణం।
పాపయేగేనభావేన కారకేణబలాబలే॥

తా॥ తరువాత భ్రాతృశాపమును తెలుసుకొను మార్గమును చెప్పుచున్నాను వినుము పాపగ్రహముల స్థితినిబట్టియు పుత్రకారకుని బలాబలమునుబట్టియు భాతృశాపమును తెలుసుకొన వలయును.

శ్లో॥ భ్రాతృస్థానాధిపెపుత్రె కుజరాహుసమన్వితె।
పుత్రలగ్నేశ్వరారంధ్రె భ్రాతృశాపాత్సుతక్షయః॥

తా॥ తృతీయాధిపతి పంచమమందు కుజరాహువులతో గూడి యుండిపంచమాధిపతి లగ్నాధిపతియు అష్టమందుండిన యడలభ్రాతృశాపమువలన పుత్రులునశించు చుందురని తెలుసుకొనవలయును.

శ్లో॥ లగ్నేసుతేకుజేమందె భ్రాతృపెభాగ్యరాశిగె।
కారకెనాశరాశిస్థె భ్రాతృశాపాత్సుతక్షయః॥

తా॥ లగ్నమందు అంగారకుడును పంచమమందు శనియును తృతీయాధిపతి నవమస్థానమందును భ్రాతృకారకుడు అష్టమమందునువున్నయడల సోదరశాపమువలన సుతనష్టము గలుగును.



శ్లో॥ భ్రాతృస్థానెగురౌనీచె మందఃపంచమగోయది।
నాశస్థానెభాగ్యపారా భ్రాతృశాపాత్సుతక్షయః॥

తా॥ బృహస్పతినీచుడై తృతీయమందును శనిపంచమమందును నవమాధిపతి కుజులుఅష్టమమందును వున్నయడల సోదరశాపము వలనసుతనష్టము గలుగును.

శ్లో॥ మూర్తిస్థానాధిపెరిఃఫె భౌమఃపంచమగోయది।
పుత్రేశెరంధ్రపాపస్థె భ్రాతృశాపాత్సుతక్షయః॥

తా॥ లగ్నాధిపతి ద్వాదశమందును, కుజుడుపంచమ మందును పంచమాధిపతి అష్టమమందును వుండినయడల సోదరశాపము వలన సుతనష్టము గలుగును.

శ్లో॥ పాపమధ్యగతెలగ్నె సుతభెపాపమధ్యగె।
నాథేచకారకెదుఃస్థె భ్రాతృశాపాత్సుతక్షయః॥

తా॥ లగ్నమునకు ద్వాదశ ద్వితీయములందు పాపగ్రహము లుండగా పంచమరాశి పాపగ్రహమధ్య గతమైయుండగా పంచమాధిపతిన్ని పుత్రకారకుడున్ను ౬-౮-౧౨ స్థానములందున్నయడలసోదర శాపమువలనసుత నష్టముగలుగును.

శ్లో॥ కర్మేశెభ్రాతృభావస్థె పాపయుక్తెసుతెశుభె।
పుత్రెశెకుజసంయుక్తె భ్రాతృశాపాత్సుతక్షయః॥

తా॥ దశమాధిపతి తృతీయమందు వుండగా పంచమస్థానమందుపాప గ్రహములుండి పంచమాధిపతి శుభుడై అంగారకునితో గూడినయడల సోదరశాపము వలనసుతనష్టము గల్గును.

శ్లో॥ భ్రాతృస్థానెబుధక్షేత్రె శనిరాహుసమన్వితె।
రిఃఫెపిదారేపాపాశ్చే భ్రాతృశాపాత్సుతక్షయః॥

తా॥ తృతీయస్థానము బుధక్షేత్రమై శనిరాహువులతో గూడి యుండగా ౧౨-౭ స్థానములందు పాపగ్రహములున్న యడలసోదర శాపమువలన సుతనష్టము గలుగును.

శ్లో॥ లగ్నేశెభ్రాతృరాశిస్థె భ్రాతృస్థానాధిపెసుతె।
లగ్నభ్రాతృసుతెపాపె భ్రాతృశాపాత్సుతక్షయః॥

తా॥ లగ్నాధిపతి తృతీయమందును తృతీయాధిపతి పంచమ

మందునువుండగా ౧-౩-౫ స్థానములందు పాపగ్రహములున్నయెడల సోదరశాపము వలనసుతనష్టము గలుగును.

శ్లో॥ భ్రాతృస్థానాధిపే పుత్రస్థానస్థితే కారకేతదా।
రాహుమాందియుతేదృష్టే భ్రాతృశాపాత్సుతక్షయః॥

తా॥ తృతీయాధిపతి అష్టమస్థానమందుండగా పుత్రకారకుడు పంచమరాశియందుండి రాహుగుళికులతో గూడిగాని చూడబడిగాని యున్నయెడల సోదరశాపమువలన సుతనష్టము గలుగును.

శ్లో॥ నాశస్థానాధిపే పుత్రే భ్రాతృనాథేనసంయుతే।
రంధ్రే ఆరార్కసంయుక్తే భ్రాతృశాపాత్సుతక్షయః॥

తా॥ అష్టమాధిపతి పంచమమందు తృతీయాధిపతితో గూడి యుండగా అష్టమమందు కుజశనులున్నయెడల సోదరశాపము వలన సుతనష్టము గలుగును

శ్లో॥ భ్రాతృశాపవిమోక్షార్థం శ్రవణంవిష్ణుకీర్తనం।
చాంద్రాయణంచరేత్పశ్చాత్ కావేర్యాంవిష్ణుసన్నిధౌ।
అశ్వత్థస్థాపనంకార్యం దశధేనుప్రదాపనం।
ప్రాజాపత్యంచరేత్తస్య భూమిందద్యాత్ఫలాన్వితం।
ఏవంయఃకురుతేభక్త్యా పుత్రవృద్ధిఃప్రజాయతే॥

తా॥ ఈ భ్రాతృశాపము నశించుకొఱకు హరినామస్మరణమునున్ను హరికథా శ్రవణమునున్ను చేయుచు చాంద్రాయణ వ్రతమును చేయుచు కావేరీతీరమందు విష్ణుసన్నిధిని అశ్వత్థవృక్షమును స్థాపించిపదిగోవులను దానముచేసి ప్రాజాపత్య వ్రతమునుచేసి సస్యముతోగూడిన భూమిని దానముచేయవలెను యిట్లుచేసినయెడల వంశమువృద్ధినొందును.

మాతుల శాపమువలన పుత్రనష్టము.

శ్లో॥ పుత్రస్థానేబుధజీవే కుజరాహుసమన్వితే।
లగ్నమందసమాయోగే మాతులాత్సుతనాశనం॥

తా॥ పంచమ స్థానమందు బుధబృహస్పతులు కుజరాహువులతోగూడియుండగా లగ్నమందు శనియున్నయెడల మాతులశాపము వలనసంతాననష్టము గలుగును.



శ్లో॥ లగ్నపుత్రేశ్వరౌపుత్రే బుధభౌమసమన్వితే।
మందేమాతులశాపాద్వా పుత్రసంతతినాశనం॥

తా॥ లగ్నపంచమాధిపతులును బుధకుజులున్ను శనియున్ను పంచమమందుండిన యెడలమాతుల శాపమువలన సంతాన నష్టము గలుగును.

శ్లో॥ లుప్తేపుత్రాధిపేలగ్నే సప్తమేభానునందనే।
లగ్నేశేబుధసంయుక్తే తస్యసంతతినాశనం॥

తా॥ లుప్తుడైన పంచమాధిపతి లగ్నమందును శనిసప్తమందునువుండగా లగ్నాధిపతి బుధునితోగూడి యుండినయెడల సంతానమునశించును.

శ్లో॥ జ్ఞాతిస్థానాధిపేలగ్నే వ్యయేశేనసమన్వితే।
శశిసౌమ్యకుజేపుత్రే తస్యసంతతినాశనం॥

తా॥ షష్ఠాధిపతి ద్వాదశాధిపతితో గూడిలగ్నమందుండగా చంద్రకుజబుధులు పంచమమందుండిన యెడలసంతాననష్టముగల్గును.

శ్లో॥ పుత్రలగ్నాధిపౌయుక్తౌ వనోన్యన్యంవాధవీక్షితౌ।
పుత్రేపరస్పరస్థౌవా పుత్రయోగాఇమేస్మృతాః॥

తా॥ లగ్నపంచమాధిపతులుఅన్యోన్యముగా గూడియున్నను పరస్పరము చూడబడుచున్నను లేకవకరియింట నొకరువున్నను సంతానయోగము చెప్పవలయును.

శ్లో॥ తద్దోషపరిహారార్థం విష్ణుస్థాపనముచ్యతే।
వాపీకూపతటాకాది బంధనంసేతుదర్శనం॥
పుత్రవృద్ధిఃభవత్యేవ సంపద్వృద్ధిఃప్రజాయతే।
ఇదంయోగగ్రహైశ్చైవ ఫలంబ్రూయాద్విచక్షణః॥

తా॥ మాతులశాపము నశించుకొఱకు విష్ణుస్థాపనము తటాకప్రతిష్ఠ కూపప్రతిష్ఠ చేయవలయును సేతుస్నానము చేయవలయును ఇట్లుచేసినయెడల వంశవృద్ధియు సంపద్వృద్ధియు గలుగును జాతకగ్రహములనుబట్టియీఫలాఫలములనుజ్యోతిష్కుడు చెప్పవలయును.

బ్రహ్మశాపమువలన సంతాననష్టము.

శ్లో॥ గురుక్షేత్రేయదారాహుః పుత్రేజీవారభానుజాః।
ధర్మస్థానాధిపేనాశే బ్రహ్మశాపాత్సుతక్షయః॥

తా॥ రాహువుధను మీనములందును పంచమమందు గురుకుజశనులును నవమాధిపతి అష్టమమందును వున్నయెడల బ్రహ్మశాపమువలన సంతాననష్టము గలుగునని తెలుసుకొనవలయును.

శ్లో॥ విద్యాగర్వేణయోమర్త్యో బ్రాహ్మణానాంనమానతే।
తద్దోషాద్బ్రహ్మశాపత్వాత్సంతతేస్తస్యనాశనం॥

తా॥ బ్రహ్మశాపస్వరూపమును చెప్పుచున్నాడు విద్యాగర్వముచేత బ్రాహ్మణులను తిరస్కరించినయెడల ఆతిరస్కారమే బ్రహ్మశాపరూపముగా పరిణమించి సంతాననష్టమును చేయుచుండును.

శ్లో॥ ధర్మేశేపుత్రభావస్థే పుత్రేశేనాశరాశిగే।
జీవారరాహుమృత్యుస్థే బ్రహ్మశాపాత్సుతక్షయః॥

తా॥ నవమాధిపతి పంచమమందును పంచమాధిపతి అష్టమమందును గురుకుజరాహువులును అష్టమందును వున్నయెడల బ్రహ్మశాపమువలన సంతాన నష్టము గలుగును.

శ్లో॥ ధర్మాధిపేనీచగతే వ్యయేశేపుత్రరాశిగే।
రాహుయుక్తేక్షితేవాపి బ్రహ్మశాపాత్సుతక్షయః॥

తా॥ నవమాధిపతి నీచయందును ద్వాదశాధిపతి పంచమమందుండి రాహువుతో గూడిగాని చూడబడిగాని యున్నయెడల బ్రహ్మశాపము వలనసంతాన నష్టము గలుగును.

శ్లో॥ జీవేనీచగతేరాహౌ లగ్నేవాపుత్రరాశిగే।
పుత్రస్థానాధిపేదుస్థే బ్రహ్మశాపాత్సుతక్షయః॥

తా॥ బృహస్పతి నీచయందును రాహువు లగ్నమందుగాని పంచమ మందుగాని యుండగా పంచమాధిపతి ౬-౮-౧౨ స్థానములందుండినయెడల బ్రహ్మశాపమువలన సంతాననష్టము గలుగును.

శ్లో॥ పుత్రస్థానాధపేజీవే రంధ్రేపాపసమన్వితే।
పుత్రేశారకచంద్రావా బ్రహ్మశాపాత్సుతక్షయః॥



తా॥ గురువుగాని సూర్యుడుగాని చంద్రుడుగాని పంచమాధిపతియైయుండగా అష్టమమందు పాపగ్రహము లున్నయెడల బ్రహ్మశాపమువలన సంతాననష్టము గలుగును.

శ్లో॥ మందాంశేమందసంయుక్తే జీవేభౌమసమన్వితే।
పుత్రేశేవ్యయరాశిస్థే బ్రహ్మశాపాత్సుతక్షయః॥

తా॥ గురువుకుజునితో గూడిశన్యంశల యందుగాని శనితో గూడిగాని యున్నయెడల బ్రహ్మశాపము వలన సంతాననష్టము గలుగును.

శ్లో॥ లగ్నేగురుయుతేమందే భాగ్యేరాహుసమన్వితే।
వ్యయేగురుసమాయోగే బ్రహ్మశాపాత్సుతక్షయః॥

తా॥ లగ్నమందు గురుశనులును నవమమందు రాహువును వున్నను ద్వాదశమందు రాహువున్నను బ్రహ్మశాపము వలన సంతాననష్టముగలుగును.

శ్లో॥ తస్యదోషస్యశాంత్యర్థం కుర్యాచ్చాంద్రాయణంనరః। బ్రహ్మకూర్చత్రయంకృత్వా ధేనుందద్యాత్సదక్షిణం॥ పంచరత్నానిదేయాని సువర్ణేనసమన్వితం। అన్నదానంతతఃకుర్యా దయుతంవాసహస్రకం॥ ఏవంకృతేతుసత్పుత్రం లభతేనాత్రసంశయః। ముక్తశాపోవిశుద్ధాత్మా సపుమాన్సుఖమేధతే॥

తా॥ ఆబ్రహ్మశాపనివృత్తికై చాంద్రాయణ వ్రతమునుచేసి మూడుబ్రహ్మ కూర్చలనుచేసి పూజించి వత్సముతోగూడిన గోవును దానముచేసి పంచరత్నములను బంగారముతో గూడాదానముచేసి చివరకు పదివేలుగాని వకవేయిగాని బ్రాహ్మణులకు భోజనమును పెట్టవలయును ఇట్లుచేసినయెడల బ్రహ్మశాపమునశించి పుత్రుడు గలిగిసంతోష మొందును.

పత్నీశాపమువలన సంతాననష్టము.

శ్లో॥ దారేశేపుత్రభావస్థే దారేశస్థాంశపేశనౌ।
పుత్రేశేనాశరాశిస్థే పత్నీశాపాత్సుతక్షయః॥

తా॥ సప్తమాధిపతి పంచమ మందుండగా శనిసప్తమాధిపతి

యున్న అంశాధిపతియైయుండి పంచమాధిపతి అష్టమమందుండిన యడల భార్యాశాపమువలన సంతాననష్టము కలుగును.

శ్లో॥ కళత్రేశేనాశస్థే రిఃఫేశేపుత్రేరాశిగే।
కారకేపాపసంయుక్తే పత్నీశాపాత్సుతక్షయః॥

తా॥ సప్తమాధిపతి అష్టమమందును ద్వాదశాధిపతి పంచమమందును వుండగా పుత్రకారకుడు పాపగ్రహములతో గూడి యున్న యడలభార్యా శాపమువలన సంతాన నష్టము గలుగును,

శ్లో॥ పుత్రస్థానంగతేశుక్రే కామపేరంధ్రమాశ్రితే।
కారకేపాపసంయుక్తే పత్నీశాపాత్సుతక్షయః॥

తా॥ శుక్రుడు పంచమమందును సప్తమాధిపతి అష్టమమందునువుండగా పుత్రకారకుడు పాపగ్రహములతో గూడియున్నయడలభార్యాశాపము వలనసంతాననష్టము గలుగును.

శ్లో॥ భాగ్యస్థానంగతేశుక్రే దారేశేనాశరాశిగే।
లగ్నేపాపేసుతేపాపే పత్నీశాపాత్సుతక్షయః॥

తా॥ శుక్రుడు నవమమందును సప్తమాధిపతి అష్టమమందును వుండగా లగ్నమందును పంచమమందును పాపగ్రహములున్న యడల భార్యాశాపమువలన సంతాననష్టము గలుగును.

శ్లో॥ కుటుంబపాపసంబంధే కామేశేనాశరాశిగే।
పుత్రేపాపగ్రహైర్యుక్తే పత్నీశాపాత్సుతక్షయః॥

తా॥ ద్వితీయమునకు పాపగ్రహసంబంధముగలిగియుండి సప్తమాధిపతి అష్టమమందుండి పంచమమున పాపగ్రహము లున్నయడల భార్యాశాపమువలన సంతాననష్టము గలుగును.

శ్లో॥ భాగ్యస్థానాధిపేశుక్రే పుత్రేశేశత్రురాశిగే।
గురులగ్నేశదారేశాః దుస్థాన్సంతతినాశనం॥

తా॥ శుక్రుడు భాగ్యస్థానాధిపతియై యుండగా పంచమాధిపతి శత్రురాశియందుండగా గురువు లగ్నాధిపతి సప్తమాధిపతి ౬-౮-౧౨ స్థానములందున్న యడల సంతాననష్టము గలుగును.

శ్లో॥ పుత్రస్థానేభృగుక్షేత్రే రాహుచంద్రసమన్వితే।
వ్యయేలగ్నేధనేపాపే స్త్రీశాపాత్సుతనాశనం॥



తా॥ పంచమము శుక్రక్షేత్రమై అందు చంద్రరాహువులుండగా ౧-౨-౧౨ స్థానములందు పాపగ్రహములున్నయడల భార్యాశాపమువలన సంతాననష్టము గలుగును.

శ్లో॥ సప్తమేమందశుక్రౌచ రంధ్రేశేపుత్రభేరవౌ।
లగ్నేరాహుసమాయోగే పత్నీశాపాత్సుతక్షయః॥

తా॥ సప్తమమందు శనిశుక్రులుండగా రవిఅష్టమాధిపతియై పంచమమందుండగా లగ్నమందు రాహువున్నయడల భార్యాశాపమువలన సంతాననష్టము గలుగును.

శ్లో॥ ధనేకుజేవ్యయేజీవే పుత్రస్థేభృగునందనే।
రాహుయుక్తేక్షితేవాపి పత్నీశాపాత్సుతక్షయః॥

తా॥ అంగారకుడు ద్వితీయమందును బృహస్పతి ద్వాదశమందును వుండగా శుక్రుడు పంచమందుండి రాహువుతో గూడిగాని చూడబడిగానియున్నయడలభార్యాశాపమువలనసంతాననష్టముగలుగును.

శ్లో॥ నాశస్థావిత్తదారేశౌ పుత్రేలగ్నేకుజేశనౌ।
కారకేపాపసంయుక్తే పత్నీశాపాత్సుతక్షయః॥

తా॥ ద్వితీయ సప్తమాధిపతులు అష్టమమందును పంచమమందు కుజుడును లగ్నమందు శనియును వుండగా పుత్రకారకుడు పాపగ్రహములతో గూడియున్న యడల భార్యాశాపమువలన సంతాన నష్టము గలుగును.

శ్లో॥ లగ్నపంచమభాగ్యస్థా రాహుమందకుజాఃక్రమాత్।
రంధ్రస్థాపుత్రదారేశౌ పత్నీశాపాత్సుతక్షయః॥

తా॥ రాహువులగ్నమందును శనిపంచమమందును అంగారకుడు నవమమందును పంచమ సప్తమాధిపతులు అష్టమమందును వున్నయడల భార్యాశాపమువలన సంతాన నష్టము గలుగును.

శ్లో॥ తస్యదోషస్యశాంత్యర్థం కన్యాదానంసమాచరేత్। లక్ష్మీనారాయణందేవం సర్వాభరణభూషితం॥ మూర్తిదానంచకర్తవ్యం దశధేనూఃప్రదాపయేత్। శయ్యాంచభూషణంచైవ దంపత్యోర్దాపయేత్సుధీః॥ పుత్రఃప్రజాయతేతస్య భూమివృద్ధిశ్చజాయతే॥

తా॥ ఈదోషము నశించుటకు కన్యాదానము చేయవలయును బంగారముతో లక్ష్మీనారాయణ ప్రతిమలు చేయించి అలంకరించి దానము చేయవలయును పదిగోదానములు చేయవలయును దంపతులకు శయ్యాదానమును అలంకారదానమును చేయవలయును యిట్లు చేసినయడల పుత్రుడు గలిగి సంపన్నుడై వర్ధిల్లును.

ప్రేతశాపమున సంతాన నష్టము.

శ్లో॥ మంత్రశాపమితాస్మృత్యైః పిశాచాద్బాధ్యతేసదా।
కర్మలోపాత్పితృభ్యశ్చ తచ్ఛాపాద్వంశనాశనం॥

తా॥ మంత్రశాపమువలన పిశాచములవలన బాధగలుగును కర్మలోపమువలన పితృబాధగలుగును యీరెండును శాపహేతువులై సంతాన నష్టమును చేయుచుండును.

శ్లో॥ పుత్రస్థితౌమందసూర్యౌ క్షీణచంద్రస్తుసప్తమే।
లగ్నేవ్యయేరాహుజీవౌ ప్రేతశాపాత్సుతక్షయః॥

తా॥ శని సూర్యులు పంచమమందును. క్షీణచంద్రుడు సప్తమమందును, రాహువు లగ్నమందును, గురువుద్వాదశమందును వున్నయడల ప్రేతశాపమువలన పుత్రనష్టము గలుగును, ప్రేతయనగా పిశాచము.

శ్లో॥ పుత్రస్థానాధిపేమందే నాశస్థేలగ్నగేకుజే।
కారకేనాశరాశిస్థే ప్రేతశాపాత్సుతక్షయః॥

తా॥ శనిపంచమాధిపతియై అష్టమమందును, కుజుడు అష్టమమందును, బృహస్పతి అష్టమమందును వున్నయడల ప్రేతశాపమువలన పుత్రనష్టము గలుగును.

శ్లో॥ లగ్నేపాపేవ్యయేభానౌ సుతేచారార్కిసోమజాః।
పుత్రేశేరంధ్రభావస్థే ప్రేతశాపాత్సుతక్షయః॥

తా॥ లగ్నమందు పాపగ్రహమును ద్వాదశమందు సూర్యుడును పంచమమందు కుజశని బుధులును పంచమాధిపతి అష్టమమందును వున్నయడల ప్రేతశాపమువలన పుత్రనష్టము గలుగును.

శ్లో॥ లగ్నేరాహుసమాయోగే పుత్రస్థేభానునందనే।
కారకేనాశరాశిస్థే ప్రేతశాపాత్సుతక్షయః॥



తా॥ లగ్నమందు రాహువును, శని పంచమమందును, బృహస్పతి అష్టమమందును వున్నయడల ప్రేతశాపమువలన పుత్రనష్టము గలుగును.

శ్లో॥ లగ్నేరాహౌచశుక్రేజ్యే చంద్రమందయుతేతథా।
లగ్నేశేమృదురాశిస్థే ప్రేతశాపాత్సుతక్షయః॥

తా॥ లగ్నమందు రాహుశుక్రగురు చంద్రశనులుండగా లగ్నాధిపతి మృదురాశియందున్న యడల ప్రేతశాపమువలన పుత్రనష్టము గలుగును.

శ్లో॥ కారకేనీచరాశిస్థే పుత్రస్థానాధిపేస్థితే।
నీచదృష్టేనీచయుతే ప్రేతశాపాత్సుతక్షయః॥

తా॥ బృహస్పతి నీచయందుండగా పంచమాధిపతి నీచగ్రహముతో గూడిగాని నీచగ్రహముచేత చూడబడిగాని యున్నయడల ప్రేతశాపమువలన పుత్రనష్టము గలుగును.

శ్లో॥ లగ్నేమందేసుతేరాహౌ రంధ్రేభానుసమన్వితే।
వ్యయేభౌమసమాయోగే ప్రేతశాపాత్సుతక్షయః॥

తా॥ శనిలగ్నమందును రాహువుపంచమ మందును రవిఅష్టమమందును కుజుడుద్వాదశ మందును వున్నయడల ప్రేతశాపమువలన పుత్రనష్టము గలుగును.

శ్లో॥ కామస్థానాధిపేదుస్థే పుత్రేచంద్రసమన్వితే।
మందమాందియుతేలగ్నే ప్రేతశాపాత్సుతక్షయః॥

తా॥ సప్తమాధిపతి ౬-౮-౧౨ స్థానములందును పంచమమందు చంద్రుడును లగ్నమందు శనిగుళికులును వున్నయడల ప్రేతశాపమువలన పుత్రనష్టము గలుగును.

శ్లో॥ బాధాస్థానాధిపేపుత్రే శనిశుక్రసమన్వితే।
కారకేనాశరాశిస్థే ప్రేతశాపాత్సుతక్షయః॥

తా॥ అష్టమాధిపతి పంచమమందు శనిశుక్రులతో గూడియుండగా బృహస్పతి అష్టమమందుండిన యడల ప్రేతశాపమువలన పుత్రనష్టము గలుగును.

శ్లో॥ తద్దోషస్యపరిశాంత్యర్థం విష్ణుశ్రాద్ధంచకారయేత్ । రుద్రస్నానంప్రకుర్వీత బ్రహ్మమూర్తింప్రదాపయేత్॥ ధేనూంరజితపాత్రంచ నీలంచైవప్రదాపయేత్ । ఏతత్కర్మకృతేనైవ శాపమోక్షఃప్రజాయతే పుత్రప్రాప్తిర్భవేత్తస్య విప్రేభ్యోదక్షిణాందిశేత్॥

తా॥ ఈప్రేతశాప విమోచనమునకు విష్ణుశ్రాద్ధమును చేయవలయును రుద్రస్నానమును బ్రహ్మమూర్తి దానమును చేయవలయును నల్లగోవును అనగా పిల్లగోవును వెండికుండతోసహా దానము చేయవలయును బ్రాహ్మణులకు దక్షిణయివ్వవలయును ఇట్లుచేసిన యడల ప్రేతశాపమునశించి సంతానము గల్గిసుఖానయుండును.

## బహుపుత్ర యోగములు

శ్లో॥ పుత్రేరాహుశారవిస్సౌమ్యః కారకేశుభసంయుతే।
శుభేనవీక్షితేవాపి బహుపుత్రంసమాదిశేత్॥

తా॥ పంచమమందు రాహురవిబుధు లుండగా బృహస్పతి శుభగ్రహసంబంధముగలిగి యున్నయడల బహుపుత్రులుగలుగుదురు.

శ్లో॥ పుత్రేశెశుభరాశిస్థె శుభదృష్టిసమన్వితే।
కారకేకేంద్రభావస్థె బహుపుత్రంసమాదిశేత్॥

తా॥ పంచమాధిపతి శుభరాశియందుండి శుభగ్రహదృష్టి గలిగి యుండగా బృహస్పతి ౧-౪-౭-౧౦ స్థానములందుండిన యడల బహుపుత్రులు గలుగుదురు.

శ్లో॥ లగ్నేశెపుత్రభావస్థె పుత్రేశెలగ్నమాశ్రితే।
కేంద్రత్రికోణగెజీవె బహుపుత్రంసమాదిశేత్॥

తా॥ లగ్నాధిపతి పంచమమందును పంచమాధిపతి లగ్నమందునువుండగాగురువు ౧-౪-౫-౭-౯-౧౦ స్థానముందుండినయడల బహుపుత్రులు గలుగుదురు.

శ్లో॥ పుత్రస్థానంగతెరాహౌ మందాంశకవివర్జితే।
బహుపుత్రంనరఃవిద్యాచ్ఛుభగ్రహనిరీక్షితే।

తా॥ రాహువుపంచమమందుండి శన్యంశను వదలియుండి శుభగ్రహముచేత చూడబడుచున్నయడల బహుపుత్రులుగలుగుదురు



శ్లో॥ పుత్రస్థానాధిపెస్వోచ్చె లగ్నేశెశుభసంయుతే।
కారకెశుభసంయుక్తె బహుపుత్రంసమాదిశేత్॥

తా॥ పంచమాధిపతి యుచ్చయందుండగా లగ్నాధిపతి శుభగ్రహసంయుతుడై యుండగా బృహస్పతి శుభగ్రహముతో గూడి యున్నయడల బహుపుత్రులు గలుగుదురు.

శ్లో॥ పుత్రస్థానేతదీశేవా గురౌవాశుభవీక్షితే।
శుభేనసహితేవాపి బహుపుత్రంసమాదిశేత్॥

తా॥ పంచమస్థానముగాని పంచమాధిపతిగాని బృహస్పతిగాని శుభగ్రహములతో గూడినను చూడబడినను బహుపుత్రులు గలుగుదురు.

శ్లో॥ పరిపూర్ణబలెజీవె లగ్నెశెపుత్రరాశిగె।
పుత్రేశెబలసంయుక్తె బహుపుత్రంసమాదిశేత్॥

తా॥ లగ్నాధిపతి పంచమరాశి యందుండగా పంచమాధిపతియు గురువును బలవంతులై యుండినయడల బహుపుత్రులుగలుగుదురు.

శ్లో॥ పుత్రస్థానంగతెజీవె పరిపూర్ణబలాన్వితే।
లగ్నేశెబలసంయుక్తె పుత్రయోగాఇమేస్మృతాః॥

తా॥ బృహస్పతి పంచమమందుండి బలముగలవాడై యుండగాలగ్నాధిపతి బలవంతుడైయుండినచో బహుపుత్రులు గలుగుదురు.

శ్లో॥ వర్గోత్తమాంశగెజీవె లగ్నేశస్థాంశపెశుభె।
పుత్రేశేనయుతెదృష్టె పుత్రయోగాఇమెస్మృతాః॥

తా॥ బృహస్పతి వర్గోత్తమాంశయందుండగా లగ్నాధిపతియున్న నవాంశాధిపతి శుభుడై పంచమాధిపతితో గూడిగాని చూడబడిగాని యున్నయడల బహుపుత్రులు గలుగుదురు.

శ్లో॥ విత్తేశెపుత్రభావస్థె పరిపూర్ణబలాన్వితే।
వైశేషికాంశగెజీవె పుత్రయోగాఇమేస్మృతాః॥

తా॥ ద్వితీయాధిపతి పంచమమందు పూర్ణబలముతో నుండగా బృహస్పతి వైశేషికాంశయందున్న యడల బహుపుత్రులు గలుగుదురు.

శ్లో॥ లగ్నాత్పుత్రాధిపేస్వోచ్చే అన్యోన్యంవీక్షితేపివా।
పరస్పరస్థానగతే పుత్రయోగాఇమేస్మృతాః॥

తా॥ లగ్నపంచమాధిపతులు యుచ్చయందుండి పరస్పరము చూడబడుచున్నను పరస్పర స్థానములనుబొందియున్నను బహుపుత్రులు గలుగుదురు.

శ్లో॥ పుత్రస్థానాధిపస్థాంశ రాశీశేశుభసంయుతే।
కుటుంబేశేబలాఢ్యేతు పుత్రయోగాఇమేస్మృతాః॥

తా॥ పంచమాధిపతియున్న నవాంశరాశ్యధిపతి శుభగ్రహసంబంధముగలవాడై యుండగా ద్వితీయాధిపతి బలవంతుడై యున్న యడల బహుపుత్రులు గలుగుదురు.

శ్లో॥ లగ్నేశేదారభావస్థే దారేశేలగ్నమాశ్రితే।
ద్వితీయేశేవిలగ్నస్థే పుత్రయోగాఇమేస్మృతాః॥

తా॥ లగ్నాధిపతి సప్తమమందును సప్తమాధిపతి లగ్నమందును ద్వితీయాధిపతి లగ్నమందును వున్నయడల బహుపుత్రులు గలుగుదురు.

శ్లో॥ దారేశేగ్రహసంయుక్తే నవాంశభవనాధిపే।
పుత్రవిత్తవిలగ్నేశే పుత్రయోగాఇమేస్మృతాః॥

తా॥ సప్తమాధిపతి నవాంశాధిపతి పంచమాధిపతి ద్వితీయాధిపతి లగ్నాధిపతి వీరుగ్రహములతో గూడినయడల బహుపుత్రులు గలుగుదురు.

అనపత్య యోగములు.

శ్లో॥ గురులగ్నేశదారేశ పుత్రస్థానాధిపేషుచ।
సర్వేషుబలహీనేషు వక్తవ్యాత్వనపత్యతా॥

తా॥ గురువు లగ్నాధిపతి సప్తమాధిపతి పంచమాధిపతి వీరందఱు బలహీనులైయుండిరేని సంతానము గలుగదు.

శ్లో॥ పుత్రవిత్తకళత్రేశాః స్సంయుక్తానవభాగపాః।
పాపాంశకాపాపయుతా అనపత్యత్వమాదిశేత్॥

తా॥ పంచమ, ద్వితీయ, సప్తమాధిపతులు నవాంశాధిపతి



తోగూడి పాపాంశయందుండి పాపగ్రహములతోగూడియున్న యడల సంతానము గలుగదు.

శ్లో॥ వ్యయేశసంయుతాంశేశే మృత్యురాశౌస్థితేయది।
పుత్రేశేక్రూరషష్ట్యంశే అనపత్యత్వమాదిశేత్॥

తా॥ ద్వాదశాధిపతియున్న నావాంశాధిపతి అష్టమమందును పంచమాధిపతి క్రూరగ్రహషష్ట్యంశయందును వున్నయడల సంతానము గలుగదు.

శ్లో॥ లగ్నపుత్రేశ్వరాదుస్థే కారకేనీచరాశిగె।
అనపత్యగ్రహేపుత్రే అనపత్యత్వమాదిశేత్॥

తా॥ లగ్నాధిపతియు పంచమాధిపతియు ౬-౮-౧౨ స్థానములందుండగా బృహస్పతి నీచయందుండగా సంతానవిహీనగ్రహము పంచమమందుండిన యడల సంతానము గలుగదు.

శ్లో॥ క్రూరషష్ట్యంశకేజీవే పుత్రస్థేనాశరాశిపే।
పుత్రేశేనాశరాశిస్థే అనపత్యత్వమాదిశేత్॥

తా॥ బృహస్పతి క్రూరగ్రహషష్ట్యంశను బొందియుండి అష్టమాధిపతి పంచమమందుండి పంచమాధిపతి అష్టమమందున్నయడల సంతానము గలుగదు.

చిరకాల పుత్రయోగము.

శ్లో॥ లగ్నాధిపేకుజేస్వోచ్చే రంధ్రేమందయుతేరవౌ।
శుభదృష్టిసమాయోగె చిరాత్పుత్రముపైతిసః॥

తా॥ కుజుడు లగ్నాధిపతియై యుచ్చయందును శని అష్టమమందును వుండగా సూర్యునకు శుభగ్రహదృష్టియున్నయడల చిరకాలమునకు పుత్రుడు గలుగును.

శ్లో॥ లగ్నేమందెగురౌరంధ్రే వ్యయెభౌమసమన్వితె।
శుభదృష్టేస్వతుంగేవా చిరాత్పుత్రముపైతిసః॥

తా॥ లగ్నమందు శనియును, అష్టమమందు బృహస్పతియును; ద్వాదశమందు కుజుడునువుండి శుభగ్రహదృష్టిగలిగిగాని తన యుచ్చయందుండినగాని చిరకాలమునకు పుత్రుడు గలుగును.

శ్లో॥ పుత్రస్థానేంద జీవజ్ఞాః లగ్నే పుత్రాధిపే శుభే।
పుత్రేశే శుభరాశిస్థే చిరాత్పుత్రముపైతిసః॥

తా॥ శని గురు బుధులు పంచమమందును పంచమాధిపతి శుభరాశియందును వుండగా లగ్నముగాని పంచమాధిపతిగాని శుభులైయున్న యెడల చిరకాలమునకు పుత్రుడు గలుగును.

శ్లో॥ సుతే రాహ్వర్క శుక్రేజ్యాః శుభక్షేత్రే శుభవీక్షితే।
పుత్రేశే శుభరాశిస్థే చిరాత్పుత్రముపైతిసః॥

తా॥ పంచమమందు రాహు రవి శుక్ర గురువులు వుండగా పంచమాధిపతి శుభరాశియందుండి శుభగ్రహము చేత చూడబడుచున్నయెడల చిరకాలమునకు పుత్రుడు గలుగును.

శ్లో॥ లగ్నే సౌమ్యే ధనే పాపే తృతీయే పాపఖేచరే।
పుత్రేశే శుభరాశిస్థే చిరాత్పుత్రముపైతిసః॥

తా॥ లగ్నమందు శుభుడును ద్వితీయమందు పాపుడును తృతీయమందు పాపుడును వుండగా పంచమాధిపతి శుభరాశియందుండిన యెడల చిర కాలమునకు పుత్రుడుగలుగును.

దత్తపుత్ర యోగములు,

శ్లో॥ పుత్రస్థానే కుజే మందే బుధక్షేత్రే విలగ్నకే।
బుధదృష్టియుతే వాపి తదా దత్తాదయస్సుతాః॥

తా॥ పంచమమందు శనికుజులుండగా లగ్నముబుధక్షేత్రమై బుధునిచేత చూడబడుచున్న యెడలదత్తపుత్ర యోగము గలుగును.

శ్లో॥ పుత్రస్థానే బుధక్షేత్రే మందక్షేత్రేథవా భవేత్।
మందమాందియుతే దృష్టే తదా దత్తాదయస్సుతాః॥

తా॥ పంచమస్థానము బుధక్షేత్రముగాని శనిక్షేత్రముగాని అయివుండి శనిగుళికులతో గూడిగాని చూడబడిగాని యున్నయెడల దత్తపుత్రయోగము గలుగును.

శ్లో॥ పుత్రస్థానే బుధక్షేత్రే బుధసంస్థే క్షితేపివా।
లగ్నాధిపే శనౌవాపి దత్తపుత్రాభవంతిహి॥

తా॥ పుత్రస్థానము బుధరాశియైబుధునితో గూడిగానిచూడ



బడిగాని యుండగా శనిలగ్నాధిపతియైన యెడల దత్తపుత్రయోగము గలుగును

శ్లో॥ పుత్రేశే మంద సంయుక్తే కుజే సౌమ్యనిరీక్షితే।
లగ్నాధిపే బుధాంశేవా దత్తపుత్రాభవంతిహి॥

తా॥ పంచమాధిపతి శనితోగూడి కుజుడుబుధుని చేతచూడబడియుండగా లగ్నాధిపతి బుధనవాంశయందున్నయెడల దత్తపుత్రయోగము గలుగును.

శ్లో॥ కామేశే లాభభావస్థే పుత్రేశే శుభసంయుతే।
పుత్రే మందే బుధే వాపి దత్తపుత్రాభవంతిహి॥

తా॥ సప్తమాధిపతి యేకాదశమందును పంచమమందుబుధుడుగాని శనిగానియుండగా పంచమాధిపతి శుభగ్రహముతో గూడిన యెడలదత్తపుత్ర యోగము గలుగును,

శ్లో॥ పుత్రేశే భాగ్యభావస్థే భాగ్యేశే కర్మరాశిగే।
పుత్రే మదపదృష్టేతు దత్తపుత్రేణసంతతిః॥

తా॥ పంచమాధిపతి నవమమందును నవమాధిపతి దశమమందునువుండగా పంచమస్థానము సప్తమాధిపతిచేత చూడబడుచుండగా దత్తపుత్ర సంతానము గలుగును.

శ్లో॥ లగ్నాధిపే భృగౌస్వోచ్చే పుత్రే మందసమన్వితే।
కారకే బలసంయుక్తే దత్తపుత్రాత్తుసంతతిః॥

తా॥ శుక్రుడు లగ్నాధిపతియై యుచ్చయందును శనిపంచమమందునువుండగా బృహస్పతిబలవంతుడై యున్నయెడల దత్తపుత్ర సంతానము గలుగును.

శ్లో॥ పుత్రస్థానాధిపే చంద్రే లగ్నే పుత్రే శనైశ్చరే।
పరిపూర్ణబలే జీవే దత్తపుత్రాత్సుతీభవేత్॥

తా॥ చంద్రుడు పంచమాధిపైయె యుండగా లగ్నమందుగాని పంచమమందుగాని శనియుండగా బృహస్పతి సంపూర్ణ బలవంతుడైయున్నయెడల దత్తపుత్ర సంతానము గలుగును.

శ్లో॥ పుత్రాధిపే రవౌ లగ్నే పుత్రస్థానే శనిసోమజౌ।
పుత్రాధిపే బలయుతే దత్తపుత్రాత్సుతీభవేత్॥

తా॥ సూర్యుడు పంచమాధిపతియై లగ్నమందును శనిబుధులు పంచమమందును వుండగా పంచమాధిపతి బలవంతుడై యుండగా దత్తపుత్రసంతానము గలుగును.

శ్లో॥ లగ్నాధిపే బుధే పుత్రే కుజదృష్టిసమన్వితే।
కారకే లాభరాశిస్థే దత్తపుత్రాత్సుతీభవేత్॥

తా॥ బుధుడు లగ్నాధిపతియై పంచమమందుండి కుజదృష్టి గలిగియుండగా బృహస్పతి యేకాదశమందున్న యడల దత్తపుత్రసంతానము గలుగును,

శ్లో॥ లగ్నాధిపే గురౌ పుత్రే శనిదృష్టిసమన్వితే।
పుత్రేశే భౌమరాశిస్థే దత్తపుత్రా భవంతిహి॥

తా॥ గురువు లగ్నాధిపతియై పంచమమందుండి శనిదృష్టితో గూడియుండగా పంచమాధిపతి కుజక్షేత్రమందున్నయడల దత్తపుత్రయోగము గలుగును.

ఇతి సంతానరత్నాకరే చతుర్దశ పటలస్సమాప్తః.

గ్రంథము సంపూర్ణము.

---